

# గాంధీ బాల్యం - చదువు

గాంధీ బాలుని వయస్సులో చాలా భయస్థుడు. ప్రైమరీ స్కూల్లో చదివేప్పుడు గూడా తోటి విద్యార్థులతో కలిసి మెలిసి మాట్లాడాలంటే పిరికితనం అడ్డుకునేదట. అందుకు స్కూల్లో ఆఖరిబెల్ కొట్టగానే సంచి బుజానేసుకుని పిల్లలందరి కంటే ముందో వెనుకో గబగబా పరుగు తీసుకుంటూ యింటి కొచ్చేసేవాడట!. దార్లో ఎవరన్నా కనబడి పలకరిస్తారనే భయం! ఆ పిరికితనంతోనే చిన్న తరగతులు దాటి హైస్కూల్ ఆవరణలో అడుగుపెట్టాడాయన. అప్పటికి ఆయనకు పన్నెండేళ్లు.

ఆరో తరగతిలో వుండగా విద్యాశాఖాధికారి జైల్స్ అనే ఆయన పిల్లలు ఎలా చదువుతున్నారోనని ఇనస్పెక్షన్‌కు మాస్కూలుకు వచ్చారు. మా క్లాసు టీచర్ ఇన్‌స్పెక్టర్ గారికి సాదర స్వాగతం పలికి

"ఏమి పరీక్ష చేయించమంటారు" అని మా టీచర్ విద్యాధికారిగారిని అడిగారు.

"ఇంగ్లీష్ మాటలు చెప్పి రాయించండి!" అని జైల్స్ గారు చెప్పగా "మీరే చెప్పండి మా విద్యార్థులు రాస్తారు!" అన్నారు టీచర్.

వెంటనే ఆయన "కెటిల్, సిటింగ్ అనే మాటను యింగ్లీషులో రాయండి!" అన్నారు.

అందరితో పాటు నేను తలొంచుకురాసాను. బెత్తం పట్టుకుని మా చుట్టూ తిరుగుతున్న మేష్టారు నా కాలు తొక్కి "ఇది తప్పు! ఆ పక్కవాడిది చూసి సరిగారాయి!" అని సైగ చేశారు. కానీ అలా చేయలేదు నేను. ఒకరి పలకలో రాతను మరొకరు చూసిరాయకుండా మాష్టారు అక్కడ కాపలాగా వున్నారనే నా భావం. అటువంటి ఆయనే ప్రక్కవారి పలక చూడమని సైగ చేయటం తప్పుగదా అనే ఆలోచనతో నాకు చేతనైన రీతిగా రాసి అధికారి ముందుకు తీసుకు వెళ్లాను. ఆయన నా రాతలో తప్పు గ్రహించి 'కెట్టిల్' కు కెయిటిటిఐఎల్ రాయాలి నీవు 'కెయిటిఐఎల్' మాత్రమే రాసావు మరొక 'టి' చేర్చుకో" అని చెప్పి వెళ్లి పోయారు.

ఆ తర్వాత మా టీచర్ నన్ను నిలవేసి "పక్క కుర్రవాడి పలక చూసి రాయమని సైగ చేసి చెప్పినా సరిగా ఎందుకు రాయలేదు" అని నన్ను దండించి అడిగారు. అందుకు నేను ఏడుస్తూ "పక్కవారిని చూసి కాపీ రాయకుండా మీ రక్కడ కాపలాగా వున్నారు! మీ డ్యూటీ మీరు చేస్తుండగా అలా రాయటం తప్పు గదా!" అని ధైర్యంగా చెప్పగానే ఆయన బెత్తం దించేసి వూరుకున్నారు. ఇతరుల్ని చూసి రాయటం, చేయటం నా జీవితంలో నేను మరెప్పుడూ చేయలేదు!

# కస్తూర్బాకు చదువు రాదు!

నాకు పదమూడో ఏట పెండ్లి అయింది. ఆ నాడు వరునికి గానీ, వధువుకి గానీ ఏమీ తెలియకుండానే పెళ్లి మాటలు, ప్రధానాలు వగైరా వారి వారి తల్లి దండ్రుల తరఫునే జరిగిపోతుండేవి. నా పెళ్లికి ముందు నాకు తెలియకుండానే రెండు ప్రధానాలు జరిగాయట. అలా ప్రధానం జరిగిన యిద్దరు కన్యలు కొద్ది కాలానికే చనిపోయారట. ఈ ప్రధానం గూడా నా తొమ్మిదేళ్లవయస్సులో జరిగింది. నాలుగేళ్ల తరువాత కస్తూర్బాతో నాకు వివాహం అయింది. ఆమెకు చదువురాదు. కానీ ఆమె స్వభావం మంచిది. చదువుకోవాలనే ఆలోచన ఆమెకు చిన్న తనం నుంచీ లేదు. తల్లి దండ్రులు కూడా ఆ విషయంలో కస్తూర్బాను బలవంత పెట్టలేదు. నేను చదువుకున్న వాడిని గనుక ఆమెకూ చదువు నేర్పించాలని అనుకున్నాను. పెళ్లైయ్యాక నాలుగైదు సంవత్సరాలు జరిగిన తరువాత ఆమెతో కొంత చనువు ఏర్పడింది. అప్పుడు ఆమె చదువును గురించి ప్రస్తావించాను. ఆనాడు గుజరాత్, రాజస్థాన్ రాష్ట్రాల్లో మేలిముసుగు (ఘోషా) సంస్కృతి మరీ కఠినంగా అమలు జరుగుతుండేది. ఇప్పుడూ ఆ మేలి ముసుగులు వున్నాయిగానీ ఆ రోజుల్లో వున్నంత ఘోరంగా లేవు. కస్తూరిబాయి ఆ మేలి ముసుగు రోజుల్లోనే కాపురానికొచ్చిన కొత్తల్లో ఆమెకు చదువు చెప్పటానికి ఒక ఉపాధ్యాయుడిని ఏర్పాటు చేసాను. పర్దా చాటున కస్తూరిబాయి చదువు సరిగా సాగలేదు. చివరికామె నన్ను వ్యతిరేకించి "ఆ మాష్టర్ దగ్గర నేను చదువుకోను" అని తెగేసి చెప్పింది. సరే ట్యూషన్ ఫీజ్ దండగైంది అనుకుని ఆయన్ను మాన్పించేశాను.

మరొక కొత్త ప్రయోగం చేశాను. నేనే కస్తూరిబాయికి చదువు చెప్పసాగాను. ఆనాడు మా యస్సేమిటి? ఇద్దరిలో యవ్వనం పొంగులు వారుతున్న వయస్సు; నేను చదువు చెప్పటం, ఆమె నేర్చుకోవటం సాగేపనా! ఎన్నిసార్లు ఎంత ప్రయత్నించినా 'అ ఆ' ల దగ్గరే చదువు ఆగిపోతుండేది! ఆ దశ దాటిన తరువాత నేను సంపాదనలోనూ, ప్రజా జీవితంలోనూ మునిగిపోయాను. జరిగిందేమిటంటే చివరకు ఏతా వాతా కస్తూరిబాయి చదువరి కాలేకపోయింది. నేను గానీ మరెవరైనా జాబులు రాస్తే చాలా నిదానంగా చదవగలిగే స్థితికి మాత్రం చేరుకుంది. కాలక్రమేణా ఆమె గూడా ఏదో వక విధంగా గ్రామీణ భాషలో ఉత్తరాలు చాలా నిదానంగా రాయటం కష్టపడి నేర్చుకుంది! అయితే నా సహచర్యంలో మిగిలిన అన్ని విషయాల్లోనూ భార్య భర్తతో ఎప్పుడు ఎలా సహకరించాలి ఎలా నడుచుకోవాలో అనే విషయాలు బాగా తెలుసుకుని సంచరించేది లేదంటే నావంటి విలక్షణమైన భర్తతో కాపురం చేయగలిగేది కాదు. ప్రతి విషయంలోనూ జీవితాంతం భార్యగా నాతో సహకరించ గలిగిందంటే గొప్పే గదా మరి!

**-గాంధీ ఆత్మకథ**

# బుజ్జాయి

ఎడిటర్ & పబ్లిషర్
జి.వి.రావు



ఈ సంవత్సరం అంత సంతోష దాయకంగా కాలం జరిగినట్లు కనిపించదు. మన రాష్ట్రంలో కొన్ని ప్రాంతాల్లో కరవు, కొన్ని ప్రాంతాల్లో మంచినీటి కొరత, తరువాత అతి వృష్టివలన ఊళ్లకు ఊళ్లు జలమయమైపోయి వరద వెల్లువలు, ఆపైన తుఫానులు దాంతో జనజీవనం అస్తవ్యస్తమై పోవటం; మరింకా ఆర్‌టిసివారి దీర్ఘకాల సమ్మె; వారికి మద్దతుగా మరికొన్ని సంఘాలు సానుభూతి సమ్మెలు జరిగాయి. ఇవన్నీ చూడగా ప్రజలకు అశాంతి, అసౌకర్యం, అల్లర్లు, అసంతృప్తితో జీవనం కుంటుపడి పోయేస్థితి వచ్చింది.



ఇటువంటి అస్థిమిత పరిస్థితిలో పిల్లల చదువులు, ఉద్యోగాలు, వ్యాపారస్థుల ఆదాయాలు అన్ని దెబ్బ తింటాయి గదా! ఇలాంటి క్లిష్ట పరిస్థితిలోనే తొట్రుపాటు పడకుండా, శాంతంగా, నిదానంగా పరిస్థితులను సరిదిద్దుకోవాలి. ఒకసారి పట్టాలు తప్పిన బండిని జాగ్రత్తగా మళ్లీ పట్టాలపైకెక్కించి దానికావల్సిన ఉత్సాహం, ఇంధనం, నడిపే మంచి చోదకుడిని ఎన్నుకుని జీవనయాత్ర సాగించాలి. ఇందులో పిల్లల పాత్ర గూడా చాలా వుంది. పెద్దల పరిస్థితి బాగు లేనప్పుడు ఉన్నదాంతోనే సరిపెట్టుకుంటూ పోతూ గొంతెమ్మ కోర్కెలు తగ్గించుకుని సక్రమంగా పాఠశాలలకు వెడుతూ మరింత శ్రద్ధగా చదివి మంచి మార్కులతో ఉన్నత శ్రేణిలో నిలుస్తుండాలి. ఆ పండక్కి అది తేలేదు, ఈ పండక్కి బట్టలు కొనలేదు, పుట్టిన రోజుకు బహుమతులు తేలేదు అని పేచీలు పెట్టి యింట్లో ప్రశాంతతను చెడగొట్టకూడదు. అలాగే పెద్దలు గూడా వారి కష్టనష్టాలు ఎన్ని వున్నా పిల్లలకు కనీస సౌకర్యాలు తీరుస్తూ ఉన్నంతలో వారిని తృప్తి పరుస్తూ చదువు కుంటు పడకుండా చూడాలి. అప్పుడే మీది మంచి కుటుంబం అనే పేరొస్తుంది. పిల్లలు గూడా అందరూ బుద్ధిమంతులు అంటారు!



డిసెంబర్-2001
సంచిక : 4
సం॥ చందా॥ రూ. 96.00
సంపుటి : 27
విడిప్రతి వెల : 8.00





# రుక్మాంగదుడు

దేశ ఉత్తర ప్రాంతంలో చేర రాజ్యంను రుక్మాంగదుడనే రాజు పాలిస్తున్నాడు. రాజ్య ప్రజలను కన్నబిడ్డల వలె
చూసుకుంటూ నీతి ధర్మాలు తప్పకుండా సుభిక్షంగా పాలిస్తున్నాడాయన. అతనికి ఒక కుమారుడు లేక లేక ఎన్నో
నోములు, వ్రతాలు చేసిన తరువాత కలిగాడు. రుక్మాంగదుడు నిస్సంతుగా వున్నప్పుడు ఎన్నో పుణ్యక్షేత్రాలు దర్శించి
ఎందరో రుషులను, సాధుపుంగవులను సేవించేవాడు. ఎవరేది చెబితే అది శ్రద్ధాభక్తులతో చేస్తుండేవాడు. కానీ సంతానం
కలగ లేదు. చివరకు ఓ సాధు పుంగవుడు కన్పించి "నీవు ఏకాదశి వ్రతమును నిరంతరం చేస్తుంటే విష్ణు మూర్తి కరుణ
వలన నీకు యోగ్యుడైన పుత్రుడు కలుగుతాడు." అని చెప్పి వెళ్లిపోయాడు.

పిమ్మట రుక్మాంగదుడు ఏకాదశీ వ్రతాన్ని క్రమం తప్పకుండా చేయసాగాడు. ఆ భార్య భర్తలు శ్రద్ధగా ఏకాదశీ
వ్రతాన్ని ఆచరించిన ఫలితంగా యోగ్యుడైన పుత్రుడు కలిగాడు. ఆ రాజదంపతులు ఆ బిడ్డడిని అల్లారు ముద్దుగా
పెంచుకుంటున్నారు. ఆ బాలుడిని సకల విద్యా పారంగతుడిని చేస్తున్నారు. వారి అభీష్టము నెరవేర్చిన ఏకాదశీ
వ్రతమును మాత్రము ఆ దంపతులు మరువలేదు. ప్రతి మాసం వచ్చే రెండు ఏకాదశులు శ్రద్ధా భక్తులతో ఆచరిస్తున్నారు.
'యథారాజా తథా ప్రజా' అన్న సామెతగా ఆ ఏకాదశీ వ్రతాన్ని రాజ్యంలో ప్రజలందరూ గూడా చేయసాగారు! రాజ్యం
నలుమూలలా భక్తి కాంతు లీనుతూ రాజ్య ప్రజలందరూ అధ్యాత్మిక చింతనతో మునిగిపోయున్నారు.

రుక్మాంగదుని తీరు చూసి ఇంద్రునికి కన్ను కుట్టింది. ఈ రాజు భక్తితో తన ఇంద్ర పదవిని ఆక్రమించేలాగున్నాడని
తలంచి రుక్మాంగదుడికి వ్రత భంగం కలిగించటానికి తన దర్బారులో నుంచి మోహిని అనే నాట్యగత్తెను పంపించాడు.
ఆమె రుక్మాంగదుని రాజ్యంలో ప్రవేశించి నాట్య, సంగీత ప్రదర్శనలు యివ్వసాగింది. రాజ్యంలో ప్రముఖులు, పండి
తులు ఆమె ప్రావీణ్యాన్ని తెగ మెచ్చుకున్నారు. ఆ విషయం రుక్మాంగదుని వద్దకు గూడా పాకింది. ఎంతైనా క్షత్రియుడు
గదా లలిత కళలంటే ప్రీతి అందు వలన ఆమెను తన కళామందిరంలోకి వచ్చి ప్రదర్శన యివ్వమని కబురు పంపాడు
రుక్మాంగదుడు. ఆ ఆహ్వానాన్ని మోహిని కాదనకుండా "మీ రాజు గారిని నా విలాస మందిరానికే రమ్మనండి. ఇక్కడ
ఆతిథ్యం స్వీకరించిన తరువాత నా లలిత కళా ప్రావీణ్యం అంతా వారి ముందు ప్రదర్శిస్తాను!" అని కబురంపింది.

సరే కళాకారిణి మనసుపడి అడిగిందిగదా యని రుక్మాంగదుడు ఒంటరిగా మోహిని విలాస మందిరానికి వెళ్లాడు.
అక్కడ మోహిని రాజుకు సుస్వాగతం పలికి ద్రాక్ష రసాలతో మదు పాత్రలు నింపి రుచి చూపిస్తూ మధుర భక్షణాలు
తినిపిస్తూ తన హోయలన్నీ ఒలికిస్తూ నాట్య సంగీతాలతో విందులు చేస్తోంది. ఆమె లలిత కళా ప్రావీణ్యం, దేవకాంతలను
మరిపించే సౌందర్యం రుక్మాంగదుడు ఆమె మత్తులో పడిపోయాడు. మోహిని రుక్మాంగదుడిని అన్ని విధాలుగా మత్తులో
ముంచేసింది.

ఏకాదశి రోజు తెల్లవారు జామున నగరంలో విష్ణునామ సంకీర్తనం వినిపించింది రుక్మాంగదునికి. తృళ్లిపడి లేచిన
రుక్మాంగదుడు "మోహినీ! ఈ రోజు ఏకాదశి నేను ఏకాదశీ వ్రతాన్ని చేయకుండా వుండలేను నా వాళ్లందరూ వచ్చారు!
ఆ వ్రత నిమిత్తం నేను కోటకు వెడతాను!" అన్నాడు.

"రాజా! నా పసందైన విందులను, అందాలను, సంగీత, నృత్యాలను వదిలి వెళ్లటమా! వెళ్లనీయను! ఈ ఒక్కసారి
ఏకాదశీ వ్రతాన్ని చేయకపోతే ఏం మునిగిపోదు! నా విలాస మందిరంలో రసమయ నాట్యాల విందులు చేస్తాను
రాజా!" అని రాజుని వెళ్లవద్దని వారించింది.

"మోహినీ! నా ప్రాణం అయినా యిస్తాను గానీ ఏకాదశీ వ్రతాన్ని మానలేను?" అన్నాడు రుక్మాంగదుడు.

"నీ ప్రాణం నాకొద్దు కానీ నీ కొడుకు ప్రాణం యిస్తే నిన్ను వ్రతానికి పంపిస్తాను!" అంది మోహిని.

"సరే! ఏకాదశి వ్రత ఫలంగా జన్మించిన పుత్రుడిని సంహరించి నీకు కానుకగా యిస్తాను!" అని కొడుకు పై కత్తి
దూసాడు రాజు. అతని భక్తికి మెచ్చిన త్రిమూర్తులు ప్రత్యక్షమై రుక్మాంగదుని కొడుకుని రక్షించి మాయ లాడి మోహినిని
మందలించగా" దేవా! ఇది నా తప్పు గాదు! దేవేంద్రుని కోరిక ప్రకారం చేసాను!" అని స్వర్గలోకం వెళ్లిపోయింది.
త్రిమూర్తుల ఆశీస్సులతో రుక్మాంగదుడు జీవితాంతం భక్తితో రాజ్య పాలన గావించాడు!

❋



# చదువులో పోటీ!

చలమయ్య, శారదమ్మలు మధ్య తరగతికి చెందిన దంపతులు. పెద్దలు సంపాదించిన ఆస్తి పాస్థులేమీ లేకపోవడంతో రెక్కాడితేగాని డొక్కాడని సంసారం వారిది. ఏరోజూ యింటిపట్టున విశ్రాంతిగా ఉండేవాళ్ళు కాదు. ఒక పనినే నమ్ముకొనక ఏ సమయానికేపని దొరికితే అదే 'మహాభాగ్యమని' సరిపుచ్చుకొని పనిలోకి వెడుతుంటారు.

వారికి భగవంతుడు పెళ్ళైన చాలా కాలానికి గానీ సంతానం ప్రసాదించలేదు. ఎట్టకేలకు శారదమ్మ ఎన్నో నోములు పూజలు చేశాక భగవంతుడు కరుణించాడు. మల్లీశ్వరి జన్మించింది. 'మల్లి' అని ముద్దుగా పిల్చుకుంటూ ఆ దంపతులు అల్లారు ముద్దుగా పెంచుకోసాగారు.

శారదమ్మ కూతురి ముద్దు ముచ్చట్లు చూసుకుంటూ యింటి పట్టునే ఉండసాగింది.

కాలచక్ర భ్రమణంలో పన్నెండేళ్లు యిట్టే గడిచిపోయాయి. మల్లి ఒక్కొక్క తరగతి వస్తున్న ప్యాసవుతూ ఏడవ తరగతిలో అడుగు పెట్టింది. అటు చదువులోను యిటు ఆటపాటల్లోనూ అన్నిటా ముందుండడంతో ఉపాధ్యాయులకు 'మల్లి' అంటే ఎంతో అభిమానం ఏర్పడింది. అందునా సత్యం మాష్టారికి మల్లి ఛదువు పట్ల చూపే శ్రద్ధ చూసి, ఆమెకు వచ్చే మార్కులను చూసి తెగ ముచ్చటేసింది. తన తోటి ఉపాధ్యాయులతో "మల్లి అపర సరస్వతి! తగిన శిక్షణ యిస్తే ఏడవ తరగతిలో జిల్లాకే ఫస్ట్ తప్పక వస్తుంది. అటు స్కూల్‌కి యిటు మనకి మంచి పేరు ప్రతిష్టలు తెచ్చిపెడుతుంది" అన్నాడు.

"ఆ బృహత్తర బాధ్యతను తమరే తీసుకోండి మాష్టారూ! అందుకు సమర్థులు కూడా మీరు" అన్నారు సహోద్యోగులు.

**పూకాటి శ్రీనివాసులు - తలుపూరు**



“అలాగే!” అన్న సత్యంమాష్టారు మల్లి తల్లి దండ్రులను వారి యింటి వద్ద కలిసి “చదువుల సరస్వతి మీ అమ్మాయి అనుకోండి! ఎంతటి వజ్ర మైనా సాన బెట్టక ప్రకాశించదు గదా! అలాగే మీ అమ్మాయికి తగిన శిక్షణ జాగ్రత్తగా యిస్తే జిల్లాకే కాదు రాష్ట్రానికే ఫస్ట్ వస్తుంది! దయచేసి మీ అమ్మా యిని నావద్దకు పంపండి. పైసా తీసుకోకుండా యీ ఏడు పాఠ్యాంశాల్లో ప్రత్యేక శిక్షణ యిస్తాను” అన్నాడు.

“అంతకంటేనా! మాష్టారూ! మహాభాగ్యంగా భావిస్తాము” అన్నారు చలమయ్య, శారదమ్మలు చేతులు జోడించి.

ఆ తర్వాత మల్లి మాష్టారు దగ్గరకెళ్ళి ఏడవ తరగతి పబ్లిక్ పరీక్షలలో మంచి మార్కులు సాధిం చేందుకు విశేషంగా కృషి చేయసాగింది.

కాని దైవం మరొకటి తలచింది. మల్లి విషయంలో మాష్టారు ఆశించిందేమీ జరగలేదు. అదే దైవలీలేమో!

ఒక రోజు పండుగ సామాను కోసం బస్తీకి బయలుదేరిన చలమయ్య, శారదమ్మలు యింటికి ప్రాణాలతో తిరిగి రాలేదు. మార్గం మధ్యంలో జరిగిన లారీ యాక్సిడెంట్‌లో చనిపోయారు. వారు మల్లిని అనాథను చేశారీలోకంలో!

కానీ, మల్లి దైన్యస్థితి చూసి వెంటనే ప్రభుత్వం కొంత ధనసహాయం చేసింది. యాక్సిడెంట్ చేసిన లారీ యాజమాన్యం కొంత డబ్బు యిచ్చారు. నెల నెలా వడ్డీ యిచ్చేట్లుగా ఆ మొత్తం బ్యాంక్‌లో వేశారు.

అంతలో కర్మకాండ రోజు రానే వచ్చింది. ఆ రోజు బంధు జనం మల్లి పోషణ చూసి, చదువు చెప్పించి పెళ్లి చేసే బాధ్యతను దూరపు బంధువులైన నరహరి, సరోజిని అనే నిరుపేద దంపతులకు అప్ప గించారు.

అందుకు అంగీకరించిన నరహరి, సరోజిని తమ కూతురు లీలతో కలిసి వచ్చారు. మల్లితో కలిసి ఉండసాగారు. లీల ట్రాన్స్‌ఫర్ సర్టిఫికెట్ తెచ్చి ఏడవ తరగతిలో చేర్చారు.

నరహరి, సరోజినిలు అంత మంచి వాళ్లు కాదు. కుటిలాత్ములు, కఠినాత్ములు. తమ కూతుర్ని చక్కగా ముస్తాబు చేసి వేళకు తిండి పెట్టి బడికి పంపేవారు. ట్యూషన్‌కి సైతం పంపేవాళ్లు. మల్లికి సరియైన వేళకు తిండి పెట్టే వాళ్ళు కాదు. బడికి టైమ్‌కి పంపేవాళ్లు కాదు. ట్యూషన్‌కి వెళ్తానంటే “నువ్వు తెగ చదివి ఉద్యోగాలు చెయ్యాలా, ఊళ్ళేలాలా? చక్కగా పనీ పాటా నేర్చుకుంటే అదే పదివేలు, నీకు వయసొచ్చాక ఒక అయ్య చేతిలో పెట్టేస్తే మాకు పేరూ, నీకు మంచి పనిమంతురాలనే కీర్తి అత్త వారింట వస్తుంది.” అని పల్కి బడికిసరిగా పంపేవాళ్ళుకాదు. తాము బయట పనికెళ్తూ రోజూ యింటి పని, వంటపని మల్లికి అప్ప గించేవారు. పనిచేత కాలేదంటే చెయ్యి చేసుకునే వాళ్ళు.

అలా క్రమంగా మల్లిని బడికి నామం పెట్టించి తమ వెంట పనికి తీసుకెళ్తే నాలుగు డబ్బులు వస్తా యని వాళ్ళ భావన. తమ కూతుర్ని చక్కగా చదివిం చుకోవాలనే దురాలోచన మెండుగా ఉండేది!

అదే సమయంలో మమత అనే ఓ కలవార మ్మాయి ఆ పాఠశాలలోనే ఏడవ తరగతిలో చేరింది. మమత తండ్రి ఓ ఆఫీసర్ కావడంతో మమత అప్పుడప్పుడూ జీపులో స్కూల్‌కి వచ్చేది. ప్రతిరోజూ పనివాడు ఆమెను బడిదాకా తీసుకొని వచ్చి తిరిగి తీసుకొని వెళ్ళేవాడు. మమత నిత్యం బడికి ఖరీదైన బట్టలు ధరించి వచ్చేది. రకరకాల రిబ్బన్లు, జడ పిన్నులు ధరించేది. రోజూ రకరకాల చిరుతిళ్ళు తెచ్చుకునేది. పిల్లలకు పెట్టేది. ఒక్కమాటలో చెప్పాలంటే మమత యువరాణీయే ఆ పాఠశాలలో! పిల్లలంతా మమత చుట్టూ బెల్లం చుట్టూ మూగే చీమల్లా చుట్టుముట్టే వాళ్ళు.



అంతే! సీతాకోక చిలుకలా అటుయిటు రంగు రంగుల ఖరీదైన బట్టలతో ఆడంబరంగా తిరిగే మమతతో గొంగళి పురుగువలె తన్ను పోల్చుకుంది మల్లి. బడికి ఆడంబరంగా దర్జాగా వెళ్తే వెళ్ళాలి మమతలా, లేకుంటే బడి మానేయాలి నాలా హీనంగా బడికి రాకూడదు! అనుకున్నది మనసులో.

ఆ మరుసటి దినం నుండి మల్లి పాఠశాలకు రావడం మానుకున్నది. నరహరి, సరోజిని ఎంతో సంతోషించారు. సరోజిని "మల్లీ! మంచిపని చేశావు. నీతో కల్సి ముగ్గురం పనికెళితే కమ్మటి భోజనం తినొచ్చు. కోరిన బట్టలు కొనుక్కోవచ్చు. చదువులు మనలాంటి పేదోళ్ళకు అచ్చిరావు. ఉద్యోగాలు అందని ద్రాక్ష పళ్ళేననుకో!" అన్నది లోకాన్ని కాచి వడిబోసినట్లు చేతులు తిప్పి.

విషయం తెల్సిన సత్యం మాష్టారు మల్లిని పిల్చి బడి మానినందుకు చీవాట్లు పెట్టాడు. "చదువులో పోటీ పడాలికానీ కలవారి ఆడంబరాలతో కాదు. నీలాంటి పేదసాదల కోసం, ముఖ్యంగా మహిళల కోసం ప్రభుత్వం ఎన్నో రాయితీలు, రిజర్వేషన్లు కల్పించింది. మీకు ఫీజులు లేవు, ఫ్రీ బుక్స్, స్కాలర్ షిప్పులు యిస్తుంది. హాస్టళ్ళు పెట్టింది కూడా మీ కొరకే; బుద్ధిగా బడికొచ్చి చదువుకొని వృద్ధిలోకి రావాలి" అన్నాడు నచ్చచెప్తూ.

ఆ మాటలకు మల్లి, "ససేమిరా!" అనడమే కాక, "మాష్టారూ! నాలాంటి దిక్కులేని దానికి చదువు లెందుకు? ఉద్యోగాలు అసలేరావు. ఏదైనా పనిలో చేర్పండి, చాలు!" అన్నది.

అలాగే! కానీ అన్న మాష్టారు "బస్తీకి, రేపే వెళదాం! సిద్ధంగా ఉండు మా అక్కయ్యకు పనిపిల్ల ఎంతో అవసరమని చెప్పింది," అన్నాడు. మరుక్షణం తన మేనల్లుడిని పిల్చి వాడికి చెప్పాల్సింది చెప్పి బస్తీకి వాళ్ళమ్మ దగ్గరకు పంపాడు.

ఆ మరుసటి దినం మాష్టారు మల్లితో కలిసి బస్తీకి బయల్దేరి వెళ్లాడు. మల్లిని పని ఉందంటూ మహిళా కళాశాలకు తీసుకొని వెళ్ళాడు. యూని ఫారమ్స్‌లో ఉన్న పిల్లలను చూపి "దుస్తులలోనే గాని ఏకత్వం సిరిసంపదలలో కాదు. భవిష్యత్ బంగారు బాటలో సాగాలని చదువుకొంటున్నారు వాళ్లు" అన్నాడు. అక్కడెందరో మహిళలు ఉద్యోగాలు చేసుకుంటూ ఆనందంగా కనిపించారు. ఆ తర్వాత మహిళా

బ్యాంక్‌కు మల్లితో కలిపి వెళ్ళాడు. మాటల సందర్భంగా ఉద్యోగినుల స్థితిగతులను గురించి వాకబు చేశాడు. మొదట తమ స్థితి చాలా అధ్వాన్నమని ఉద్యోగం మూలంగా బాగుపడ్డామని చెప్పారు వాళ్ళు.

ఆ తర్వాత మల్లిని మాష్టారు తన అక్కయ్య భారతి యింటికి తీసుకొని వెళ్ళాడు. అదే సమయంలో తన అక్క భారతి పనిపిల్ల సక్రమంగా చేయడం లేదని నానా రకాలుగా తిట్టి చీపురుతో నాలుగు వడ్డించింది. "నీకు బాగా పొగరు పట్టింది. రెండు రోజులు తిండి పెట్టను గాక పెట్టను, వాతలు పెడతాను తెల్సా?" అంది. 8

మల్లిని చూసి, "తమ్ముడూ! యీ పిల్లేనా పనిలో చేరేది. ఈ క్షణమే చేర్చుకుంటాను. ఉన్న పని పిల్లతో వేగలేక చస్తున్నాను. వెంటనే కొట్టి దాన్ని సాగనంపుతాను" అన్నది. అప్పటికే మల్లి బస్తీలోని మహిళల అభ్యున్నతిని చూసి పరివర్తన చెందింది. దాంతో "మాష్టారు! బడికెళ్ళి బాగా చదువుకుంటా! ఉద్యోగం చేస్తా! పనిలో చేరను" అన్నది. ఆ తర్వాత మాష్టారి ప్రోత్సాహంతో ఏడో తరగతిలో జిల్లాస్థాయిలో ఫస్ట్ వచ్చింది. రెసిడెన్షియల్ పాఠశాలలో చేరి చక్కగా చదువుకొని క్రమంగా అన్ని పరీక్షల్లో పాసై ఎన్నో ఉన్నత పదవులు అలంకరించి 'విద్యాశాఖాధికారిణి' అయ్యింది.

మాష్టార్లు, ప్రత్యేకించి సత్యం మాష్టారు ఎంతో గర్వపడ్డాడు తన కృషి ఫలించినందుకు. అసలు, భారతి పనిపిల్లను కొట్టడం, తిట్టడం మాష్టారు చెప్పడంవల్లనే! పని పిల్లల దుస్థితి మల్లికి తెలియజెప్పడానికే పథకం పన్నారు! ఈ విషయం ఏనాటికీ మల్లికి తెలియదు!





# మన్మధుడు

విష్ణువు కైలాసం వెళ్ళి సంతానం కొరకు శివుని ప్రార్థించాడు. శివుడు విష్ణువు ప్రార్థనను మన్నించి, గొప్ప అందమైన కుమారుని ప్రసాదించాడు. ఆ కుమారుడే మన్మధుడు. అతడు చంద్రుని కంటెను, ఇంద్ర కుమారుడైన జయంతుని కంటెను, కుబేరుని కుమారుడైన నలకూబరుని కంటెను మిక్కిలి అందగాడు. అందమైన ఆ కుమారుని చూచుకొని విష్ణువు మురిసిపోయాడు కానీ, శివుని ప్రక్కనే వున్న పార్వతీ దేవి విష్ణువుపై ఆగ్రహించి, "శివునితో పాటు తనను కూడా, ప్రార్థించలేదు కనుక, ఈ కుమారుడు శివుని వలననే భస్మము అగునుగాక" అని శపించింది విష్ణువు తల్లడిల్లిపోయాడు. తనను క్షమించమని పార్వతిని ప్రార్థించాడు. పార్వతి అనుగ్రహించింది. "ఈ కుమారుడు తిరిగి శివుని వలననే పునర్జీవితు డగునని" శాప విమోచనం చెప్పింది - విష్ణువు సంతోషించి మన్మధునితో వైకుంఠానికి వెళ్ళాడు.

మన్మధుని వాహనం చిలుక, అరవిందాది పుష్పములు బాణములు. చెరకుగడ విల్లు. తుమ్మెదల బారుగల వింటినారితో, స్త్రీ పురుషులపై బాణ వర్షము కురిపించి పరస్పరం అనురాగములు కల్పించి బ్రహ్మదేవుని సృష్టికి సహకార మందిస్తుంటాడు. వేదాభ్యాస జడుడైన బ్రహ్మ దేవునిపై కూడా తన పుష్పబాణములు కురిపించి, సరస్వతీ దేవిపై మోహమును కల్పించాడు. తరువాత తనలో కల్గిన మార్పుకు మన్మధుడే కారణమని గ్రహించిన బ్రహ్మ దేవుడు, శివుని నేత్రాగ్నికి భస్మమయి పోవుదువని శపించాడు. మన్మధుడు తాను చేసిన దోషమును. క్షమించమని ప్రార్థించగా, ద్వాపరయుగంలో కృష్ణునికి ప్రద్యుమ్నుడనే పేరుతో జన్మిస్తావని పిమ్మట శాప విమోచనమవుతుందన్నాడు.

మన్మధుని భార్య రతీదేవి - ఈమెతో సమస్త లోకాలలో సంచరిస్తూ, సకల ప్రాణులకు ప్రేమానురాగములు కల్పిస్తూ వుంటాడు. మన్మధుడు దేవ లోకంలో రతీ దేవితో నాట్యమాడుతూ దేవతలకు ఆనందాన్ని సమకూరుస్తూ వుంటాడు.

ఇలా వుండగా, తారకాసురుడనే రాక్షసుడు, దేవ లోకంపై విజృంభించి, ఇంద్రుని ఓడించి, సింహా

గుండ్లా పుండరీకాక్షరావు - నరసరావుపేట

సనం దక్కించుకున్నాడు. తారకాసురుడు, శివునికి జన్మించిన కుమారునిచేత సంహరింప బడతాడని బ్రహ్మ దేవుడు దేవతలకు చెప్పాడు. శివుడు, సతీ దేవి వియోగంతో విరాగియై తపస్సు చేసుకుంటూ వుంటాడు. శివుని తపస్సు విరమించుకొని, తిరిగి పార్వతీ దేవిని వివాహమాడవలసిందిగా దేవత లంతా చెప్పి విఫలమవుతారు. అప్పుడు ఇంద్రుడు ఇందుకు తగినవాడు మన్మధుడేయని గ్రహించి, మన్మధుని పిలిచి, నీవు నీ పుష్ప బాణములతో శివుని సమాధి స్థితి నుండి మేల్కొలిపి, పార్వతీ దేవిపై మోహమును కల్పించమని ఆదేశిస్తాడు. మన్మధుడు ఇంద్రుని ఆజ్ఞమేరకు రతీ దేవితో శివుని తపో భూమికి చేరి, శివుని ముందు నాట్య మాడి, పుష్ప బాణములు కురిపించాడు. అంతట శివుడు కన్నులు తెరచి, తనలో కలిగిన మార్పునకు కారణము ఏమైయుండునాయని చూడగా ఎదుట మన్మధుడు మందహాస వదనుడై నిలువబడి యున్నాడు. శివునికి ఆగ్రహం కట్టలు తెంచు కొన్నది. మూడవ కన్ను తెరిచాడు. ఆ కంటి నుండి ప్రళయాగ్ని మన్మధునిపై ప్రసరించింది - మన్మధుడు భస్మమయినాడు! అంత రతీదేవి విలపించింది. తన భర్తను బ్రతికించమని శివుని ప్రార్థించింది. బ్రహ్మాది దేవతలు వచ్చి "దేవ దేవా! మహేశ్వరా! శంకరా! త్రిలోచనా! పన్నగధరా.... మన్మధుడు లేనిదే సృష్టి కొనసాగుట కష్టతరము. తిరిగి బ్రతికించమ"ని వేడుకుంటారు. వారి ప్రార్థ నను మన్నించి "ఇక నుండి మన్మధుడు ఎవరికి కనపడకుండా అనంగుడై తన కార్యకలాపాలు యధేచ్ఛగా సాగిస్తుంటాడు. రతీ దేవికి మాత్రమే కనిపిస్తూ సృష్టి కార్యాన్ని నెరవేరుస్తాడు." రతీ దేవి, తన భర్తను పునర్జీవితుని చేసిన శివునికి నమోవాక ములు సమర్పించి - ఇరువురూ దేవలోకానికి వెళ్లి పోయారు.

మన్మధునికి మనసిజుడని, భావజుడని, కంద ర్పుడని, మారుడని, స్మరుడని, కాముడని, పంచ శరుడని, కుసుమాస్త్రుడని పేర్లు ఏర్పడ్డాయి.

సృష్టిలో స్త్రీ పురుష ప్రాణులకు, తన పంచ పుష్ప బాణములతో ఉన్మాదన, తాపన, శోషణ, స్తంభన, సమ్మోహన అనే అయిదు అవస్థలను కల్గించుచూ, ఎవరికి కనపడకుండా సకల లోకాలు విహరిస్తూ సృష్టిని వృద్ధి చేయటానికి కృషి చేయు వాడే అనంగుడు! ❋





# పెద్దల ఎన్నిక

ఒకానొక ఊరిలో రామయ్య, సీతమ్మ అనే దంపతులున్నారు. ఆ దంపతులకు ఒకమ్మాయి కలిగింది. ఆ అమ్మాయి పేరు కళ్యాణి. ఆ అమ్మాయికి బాల్యం గడిచి యుక్త వయస్సు రాగానే తల్లిదండ్రులు అమ్మాయికి పెళ్లి చేయ నిశ్చయించారు. కళ్యాణి అందచందాలను, గుణగణాలను చూచి చాలా మంది ఆ అమ్మాయిని పెళ్లాడాలని ముందుకొచ్చారు. అయితే ఆమె తల్లిదండ్రులు ఒక మంచి సంబంధం చూచి నిశ్చయించారు. కళ్యాణికి ఆ వరుడు నచ్చలేదు.

కళ్యాణి ఆలోచనలు ఊహాలోకాల్లో విహరిస్తున్నాయి. ఏదో ఒక గొప్పవాడిని చేసుకోవాలని ఆమె ఊహ. ఆ ప్రాంతంలో ఉన్నవారిలో అందరినీ మించినవాడు రాజుగదా! రాజునే పెళ్ళి చేసుకోవాలని నిశ్చయించుకొంది. ఎవరన్నా అడిగితే నేను రాజునే పెళ్లాడి రాణీగా అవుతా అంటుండేది. అది విన్న వారందరూ పకాలున నవ్వి పోతుండేవారు. కానీ ఆమె రాజును ఆరాధించటం మానలేదు.

ఒక రోజు దేశాన్నేలే రాజు ఆ ప్రాంతానికి వచ్చాడు. కళ్యాణి ఆయన కోసం ఎదురు చూస్తూ నిల్చుంది. అంతలో ఒక సన్యాసి రాజుకి ఎదురుపడగా రాజు ఆయనకు సాష్టాంగపడి నమస్కరించాడు. అది చూచిన కళ్యాణి రాజు కన్నా సన్యాసి గొప్పవాడని తలచి ఆయననే వలచి ఆ సన్యాసిని అనుసరించి వెడుతోంది. అలా వెళుతున్న సన్యాసి దారి ప్రక్కగా వున్న శివలింగాన్ని ఫలపుష్పాలతో పూజించాడు. దీన్ని చూసిన ఆమె సన్యాసి కన్నా శివుడే గొప్పవాడని తలచి ఆ శివలింగం ముందే కూర్చుని శివుని కొరకు తపస్సు ఆరంభించింది. కొద్ది సేపటి తర్వాత ఒక కుక్క వచ్చి శివలింగంపై మూత్రాన్ని వదిలి అపరిశుభ్రం చేసింది. అది చూచి ఆమె అందరికన్నా కుక్కయే గొప్పది అనుకుని కుక్కను అనుసరించింది. మరి కాసేపటికి ఆ కుక్క యింట్లోకి జొరపడుతుండగా ఒక పిల్లవాడు ఆ కుక్కను చూసి రాళ్లతో కొట్టి వెళ్ళగొట్టాడు! ఇది చూసి వీధిలో వెడుతున్న ఒక యువకుడు కుక్కను ఎందుకు కొట్టావంటూ పిల్లవాడిని కోపంగా దండించాడు. అది చూచిన కళ్యాణి ఆ యువకుని భూత దయ గమనించి ఎలాగైనా ఆ యువకుడినే పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకొంది.

ఆ యువకుడు ఎవరనుకున్నారు? మరెవరో కాదు కళ్యాణి తల్లిదండ్రులు ఆమెనిచ్చి పెళ్ళి చేయడానికి నిశ్చయించిన వరుడే అతడు! కనుక అందని దాని కోసం అర్రులు చాచడం కన్నా అందిన దానితో సంతృప్తి చెందడం మంచిది అనుకొన్న కళ్యాణి పెద్దలు దూరదృష్టితో నిర్ణయించిన యువకుడినే పెళ్లాడి సుఖ. భోగాలు అనుభవించింది జీవితాంతం!

ఎమ్. హరిబాబు - ఐరగరాజుపల్లి



# మానై వంగదు

గంగడు చిన్న తనం నుంచి అల్లాటప్పాగా తిరిగి, ఆకతాయిగా పెరిగి, చిల్లరమల్లర దొంగతనాలకు అలవాటు పడ్డాడు. వీడి అదృష్టం బాగుండి పట్టిందల్లా బంగారమైంది. గ్రామాలను వదలి నగరాల మీదపడి దోచుకోసాగాడు. కాలక్రమేణ 'గజదొంగ'గా పేరు తెచ్చుకొన్నాడు.

నగరంలో దొంగతనాలతో తృప్తి చెందని గంగడు కొడితే ఏనుగు కుంభ స్థలాన్నే కొట్టాలని ఆ దేశపు రాజుధనాగారం దోచుకోబోయి సిపాయిలకు దొరికి పోయాడు. రాజు విచారించి అతని కాళ్ళు చేతులు ఖండించమని శిక్ష విధించాడు. శిక్ష అమలు జరిగింది.

గంగడి తండ్రి రంగడు ఒక కుగ్రామంలో సన్నకారు రైతు. కొడుకుకు శిక్ష పడిందని విని, రాజధానికి పరుగెత్తాడు. కాళ్ళు చేతులు ఖండించగా నెత్తురోడ్చుకొంటూ ప్రాణావశిష్టుడుగా ఉన్న పుత్రుడ్ని జూచిబావురుమన్నాడు. కొన ఊపిరితో కొట్టు మిట్టాడుతున్న గంగడు మెల్లగా కళ్ళు తెరచి "విచారించకు నాన్నా! చేసిన పాపం కట్టికుడువక మానుతుందా?" అన్నాడు.

"అన్నీ తెలిసి గూడా యీ రొంపిలో ఎందుకు కాలు పెట్టావు? నేను నెత్తిన నోరు పెట్టుకొని పోరినా నా మాట విన్నావు కాదు." అన్నాడు రంగడు కొడుకును కౌగలించుకొని. గంగడు తండ్రి ముఖంలోకి చూచి

"నేను చిన్ననాడు నీతో పొలానికి వచ్చేవాడిని. పొరుగు వారి తోటలోని వంకాయలు కోసి మన తోటలో పడేసేవాడిని. అప్పుడు నువ్వు నన్ను మందలించేవాడివి కాదు. ఊళ్ళో చిన్న చిన్న దొంగతనాలు చేసి వస్తే, తెచ్చిన వస్తువులు యింట్లో వేసుకొనేది అమ్మ. ఈ నాటి వంకాయల దొంగ రేపటి టెంకాయల దొంగ అవుతాడని మీరు గ్రహించలేక పోయారు. కష్టపడకుండా సుఖంగా బ్రతకాలంటే దొంగతనం చేయడం మంచిదనే భావన ఆ వయస్సులోనే నాకు కలిగింది. నిన్ను తప్పుపడుతున్నానని బాధపడకు. నేనిలా దొంగలా అయ్యేందుకు మీ తప్పు ఏమీ లేదా?" అని ప్రశ్నించాడు.

రంగడికి నోట మాట రాలేదు. గంగడు ఒక్క క్షణం ఆగి

"అతి గారాబంగా పెంచి, బిడ్డ ఏ తప్పు చేసినా దండించక పోవడం తల్లిదండ్రులదే తప్పు. ఆనాడే నన్ను కట్టడిజేసుంటే నేనిలా తయారయ్యేవాడినా...?" అంటూ తండ్రి ఒడిలోనే కళ్ళు మూశాడు.

రంగడి గుండె రంపపు కోతకు గురైంది. పిల్లల్ని కనడమేకాదు - వాళ్ళను తీర్చిదిద్దాల్సిన బాధ్యత కూడా తల్లిదండ్రులదేనని గ్రహించాడు. మొక్కై వంగనిది మానై వంగదన్న నగ్న సత్యం బోధ పడింది రంగన్నకు. ❋

వల్లమేటి సుందరరామయ్య - చెన్నూరు



# కష్టాల్లోనే దేవుడు !

రత్నగిరి గ్రామంలో కనకయ్య - కనకాంబరం అను దంపతులున్నారు. కనకయ్యకి పిసినారి తనం జాస్తిగా వుండేది. భర్త ప్రవర్తనకి విసుక్కున్నా, చేసేదేమీ లేక, మనసులో "భగవంతుడా! ఇతని బుద్ధెప్పుడు మారుస్తావో నీదే భారం!" అని ఊరుకునేది భార్య.

కొన్నేళ్ళు గడిచిన పిమ్మట కనకయ్య శరీరంలో కుడి భాగం పక్షవాతానికి గురయ్యింది. ఆ మందు ఈ మందు వాడినా, అప్పటికి ఉపశమనం తప్ప జబ్బు పూర్తిగా నయమయ్యేది కాదు.

డబ్బు ఖర్చయిపోతుందని బాధపడి పోతున్న కనకయ్యని చిన్నగా మందలిస్తూ భార్య "అయితే అవనివ్వండి. మనకి పిల్లా? పీచా? ఉన్నది మనకి చాలదా? ఎందుకీ యాతన? దానం ధర్మం లేని జీవితం వ్యర్థం. ఇక మనం సంపాదించ వలసినది పుణ్యం గానీ, ఆస్థులు అంతస్తులు గాదు" అని సాధిస్తుండేది.

"నీకేం పోయింది ఎన్నైనా చెబుతావు కడుపు మాడ్చుకుని సరదాలు చంపుకుని, ఇదంతా కూడ బెట్టిన నా కష్టం నీకేం తెల్సు? ఈ వైద్యులందరూ చేసే వైద్యం డబ్బు గుంజ టానికే తప్ప మరేంకాదు. నా జబ్బు ఏమిటో ఒక్క వైద్యుడైనా గుర్తించాడా? ఏవో మందులు రాసిస్తూ నా మీద ప్రయోగాలు చేస్తున్నారు." గట్టిగా భార్యని ప్రశ్నించాడు.

"మరో వైద్యుడికి చూపిద్దాం. ఆయుర్వేదం, హోమియోపతి ఇంకా మంచి మందులు వాడి చూద్దాం. అవసరం మనది - అవకాశం వారిది" చెప్పింది భార్య.

"డబ్బు ఖర్చు కాని వైద్యం ఏదైనా వుంటే చెప్పు వింటాను మరేదీ వినను" నిష్కర్షగా భర్త చెప్పేసరికి భార్య నిశ్చేష్టురాలయ్యింది.

యం. రాజేశ్వరి - అనంతపురం



'టెంపుల్ టన్' అవార్డును ఈ ఏడాది ఫ్రీమాన్ డైసన్ పొందారు

ఆ వూరికి ఒక స్వామీజీ వచ్చారని తెలిసి భర్తని వెంటబెట్టుకుని వెళ్ళి విషయమంతా స్వామీజీకి వివరించింది కనకాంబరం.

"బాబూ ప్రతిరోజూ నీవు దైవ నామస్మరణ చెయ్యి. ఈ విభూది రోజూ బొట్టుగా వాడు. నీ జబ్బు నయంకాగానే, కొండకి వస్తానని మొక్కుకో! స్వామి హుండీలో కొంత మొత్తం వేస్తానని అనుకో శుభం వెళ్ళిరా! అంతా మేలే జరుగుతుంది." అంటూ స్వామీజీ దీవించి పంపించారు ఆ దంపతుల్ని.

కొన్ని రోజులు గడిచాయి. కనకయ్య జబ్బు మాయమయ్యింది. భార్యా-భర్తల సంతోషానికి అవధుల్లేవు. రోజులు గడుస్తున్నాయి.

దేవుడ్ని మొక్కు మాట ఎత్తటం లేదు కనకయ్య.

"ఏవండీ ఆ స్వామి దయవలన జబ్బు నయమయ్యి. నిక్షేపంగా మీ చెయ్యి, కాలు పని చేస్తున్నాయి. అనుకున్న మాట ప్రకారం మొక్కు చెల్లించు కోవడం ధర్మం." చెప్పింది భార్య.

కనకయ్యకోపంగా,వెటకారంగా"నా కెందుకు గుర్తులేదూ? స్వామికొండకి వస్తామని మొక్కాము తప్ప, ఎప్పుడు వెళతాము అనుకోలేదుగా!" అన్నాడు.

ఆ మాటలకి విస్తుపోయిన భార్య నోటి వెంట మాటలు రాలేదు.

మరికొన్ని రోజులు గడిచాయి. దేవుని మొక్కు వూసెత్తని భర్త ప్రవర్తనకి భార్య బాధపడసాగింది.

ఒకనాడు హఠాత్తుగా మళ్ళీ ఆ చెయ్యి పడిపోయింది. దాంతో బెంబేలెత్తిన కనకయ్య శాశ్వతంగా జబ్బు నయం కాలేదని స్వామీజీని నిలదీసాడు.

స్వామీజీ నవ్వుతూ "పిచ్చి వాడా మొక్కు ఎప్పుడు తీరుస్తావో అనుకోలేదు నీవు. జబ్బు మరెప్పుడూ రాదని చెప్పలేదు నేను" అన్నాడు.

తన తప్పిదానికి సిగ్గుపడి స్వామీజీకి క్షమాపణలు చెప్పుకుని గుడికి వెళ్లి మొక్కు తీర్చుకుని వచ్చాడు కనకయ్య. మళ్లీ అతని ఆరోగ్యం బాగుపడింది. అది చూసి భార్య సంతోషించింది! ❋





# అసలు విషయం!

స్కూల్ బెల్ మ్రోగింది 'ఇంటర్ వెల్' కావడంతో పిల్లలంతా క్లాసు వదిలి బయటకు వచ్చారు. ఏడవ తరగతి చదువుతున్న నవీన్ స్కూల్ పూల తోటలోనున్న మందారం మొక్క ఆకుల్ని. కొమ్మల్ని గిల్లుతున్నాడు. ఆ మొక్క విచ్చిన పూలు, విరియని మొగ్గలు మరియు లేత ఆకులతో చాలా అందంగా వుంది.

కొన్ని కొమ్మలను గిల్లి వేస్తుండగా చూసిన 'కిరణ్' అనే మరో విద్యార్థి పరుగెత్తుకొని వెళ్ళి డ్రిల్ మాస్టర్ గార్కి చెప్పాడు. అప్పుడు డ్రిల్ మాస్టర్ గట్టిగా 'నవీన్ ఇలారా' అని పిలిచి నవీన్‌ను మరో మాట మాటడనీకుండా నాలుగు చురకలు బెత్తంతో అంటించిన తరువాత "తుంటరి వాడా! ఆ మొక్కలను అలా ఎందుకు పాడు చేస్తావు? నీకు ఏ మాత్రం బుద్ధిలేదు!" అని గట్టిగా తిడుతూ వుండగా.

ఇంతలో తెలుగు మాస్టరు శాస్త్రిగారు అటుగా వచ్చి 'ఏం జరిగింది?' అని అడిగారు. "వీడు మందారం మొక్కలు తుంచు తున్నాడండీ" అని డ్రిల్ మాస్టర్ అన్నారు. "ఎందుకలా చేశావ్‌రా నవీన్?" అని తెలుగు మాష్టరుగారు అడగగానే "సార్ మీరు క్లాసులో చెప్పిన వేరు పురుగు చేరి వృక్షంబు చెరచు, చీడ పురుగు చేరి చెట్టు చెరచు. అనే పద్యాన్ని విన్నాను కదా నేను బయటికి వచ్చి మొక్క దగ్గరికి వెళ్లే సరికి, కొమ్మలకు చీడ పట్టి వుంది. దాని వల్ల మిగతా మొక్కలు పూర్తిగా నాశనం కాకుండా చీడ అంటిన ఆకుల్ని, కొమ్మల్ని విరిచాను సార్" అన్నాడు వినయంగా నవీన్.

ఆ మాటలు విన్న డ్రిల్ మాస్టర్‌గారు, మిగతా విద్యార్థులు అసలు విషయం తెలియకుండా నీతి వంతుడైన నవీన్‌ను తుంటరి వాడు అన్నందుకు సిగ్గుపడ్డారు. బాలలూ! మీరు కూడా నీతి మాటలు విని మరవకుండా వాటిని పాటించాలే కాని ఈ చెవితో విని, ఆ చెవితో వదిలేయకూడదు సుమా!

అమ్మిన వెంకట అమ్మిరాజు - పేరూరు

# వార్ష్ణియనా చలి చంపేస్తోంది




















# శాంతి కావాలి!

గతంలో యలమంచిలిని ముఖ్య పట్టణముగా చేసుకుని యాదవరాజులు పరిపాలిస్తున్న రోజుల్లో నూతనంగా శ్రీశాంతి స్వరూప్ యాదవ్ రాజ్యానికొచ్చి సుభిక్షంగా పరిపాలన సాగిస్తున్నాడు. అతని పాలనలో అంతః శతృవులు ఎక్కువయ్యారు. తన తమ్ముడైన ఉగ్రరూప యాదవుడు శతృవుగా మారాడు. అతని ప్రోద్భలం వలన సామంతు రాజుల్లో తిరుగుబాటు వచ్చింది. వారిని అణచడానికి సైన్యాన్ని మంత్రి సామంతుల్ని తీసుకుని దండెత్తాడు. శతృవులపై వీర విహారం చేసి అందర్నీ జయించి రాజధానికి తరలి వచ్చాడు.

ఈలోగా తమ్ముడు ఉగ్రరూప యాదవుడు రాజధానిలోని బంధువుల్ని కోటను రక్షిస్తున్న సైన్యాన్ని లో బరుచుకుని శ్రీశాంతిస్వరూప్ యాదవ్‌పై తిరుగుబాటు చేసాడు. తిరుగుబాటును అణచడంలో సైన్యం, ధనం చాలా వ్యయమయింది. తమ్ముడు ఉగ్రరూప యాదవుడ్ని ఖైదు చేయించాడు. తిరుగుబాటును అణిచి వేసినా శాంతిస్వరూప్ యాదవుడికి శాంతిలేదు. పైగా ప్రాణ భయం. అతనిలో తీరని బాధ, రక్త సంబంధం!

శాంతి కావాలి! ఎలా !

పరిస్థితులిలా వుండగా - ఉగ్ర రూప యాదవుడి అత్త తరపు బంధువులు - ఖైదు చేయబడిన ఉగ్ర రూప యాదవుడిని విడిపించడానికి సిద్ధంగా వున్నారనే వార్తలు వేగుల ద్వారా శాంతిస్వరూప్ యాదవ్‌కు అందుతూనే వున్నాయి.

ఒకనాడు -

శాంతిస్వరూప్ యాదవుడు ప్రధానమంత్రి బుద్ధిశాలి. యాదవ్‌ను వెంట బెట్టుకుని మారు వేషాల్లో నగర పర్యటన సాగిస్తున్నాడు. నది

శ్రీకోన రాములు యాదవ్ - కశింకోట



'అమెరికన్ బ్యూటీ' చిత్రం 1999లో ఆస్కార్ అవార్డుకు ఎంపికయింది



ఒడ్డున ఒక ముసలివాడు స్నానం చేస్తున్నాడు. అతన్ని చూస్తూ రాజూ, మంత్రి అటే వెళ్ళారు. ముసలివాడు ఒడ్డుకొచ్చి కూర్చుని అతన్ని పట్టుకున్న జెర్రిని విదిలించి కొట్టాడు. అది కదిలి వచ్చి మళ్ళీ కుట్టింది. దాన్ని మళ్ళీ విదిలించి దూరంగా కొట్టాడు. ఈ దృశ్యం రాజుకి ఆశ్చర్యం కలిగించింది.

రాజు గబుక్కున అతని దగ్గిరికెళ్ళి ఇలా అన్నాడు.

"ఓ ముసలివాడా! ఆ జెర్రి నిన్ను కుట్టింది కదా బాధగా లేదూ!"

"ఉందండీ!" ముసలాడు జవాబు చెప్పాడు.

"మరెందుకు దాన్ని చంపకుండా ఒదిలి పెడుతున్నావ్!"

"నిజమే! అది కుడుతూనే వుంది, బాధగానే వుంది. కుట్టడం దాని స్వభావం. దాన్ని రక్షించడం నా స్వభావం" అన్నాతడను.

"అంటే అది అపకారం చేస్తున్నా, నువ్వు ఉపకారం చేస్తున్నావన్నమాట" అన్నాడు రాజు.

"అవును స్వామీ! అలాగే చేస్తాను. అది నా స్వభావం" అంటూ వృద్ధుడు స్నానం చేసి నది ఒడ్డు నుంచి వెళ్ళిపోయాడు.

రాజుగారు అక్కడే చతికిల బడ్డారు. మంత్రి ఆశ్చర్యంగా చూశాడు. కళ్ళు మూసుకుని నిదానంగా ఆలోచించసాగారు మహారాజు. ఆయనకేదో స్ఫురించింది.

మరునాడు నిండు రాజసభ ఏర్పాటు చెయ్యబడింది. ప్రజలు, మంత్రులు, సామంతులు, న్యాయాధికారులు సభలో కూర్చున్నారు.

రాజుగారి ఆజ్ఞమేరకు జైలు నుండి ఉగ్రరూపయాదవుడు సభకు రప్పించబడ్డారు.

శాంతిస్వరూప్ యాదవుడు సింహాసనం మీద ఆశీనులై వున్నారు. ఎదురుగుండా బోనులో దోషియైన ఉగ్ర రూపయాదవుడు నిలబెట్టబడ్డాడు.

"నాయనా! ఉగ్రరూపా! నా మీద తిరుగుబాటు చెయ్యడంలో నీ వుద్దేశం ఏమిటి?" వికటంగా నవ్వాడుగానీ. జవాబు చెప్పలేదు.

కొంచెం సేపు నిశ్శబ్దం రాజ్యమేలింది.

"అన్నయ్యా! రాజ్యం వీర భోజ్యం. నేను వీరుడ్ని. నాకు ఈ రాజ్యం కావాలి. ఈ సింహాసనం కావాలి. నేను క్షత్రియుడను. క్షత్రియుడి ధర్మాన్ని, స్వభావాన్ని నేను నిర్వర్తించాను. నువ్వు సింహాసనం మీద వున్నంత కాలం నేను రాజ్యానికి రావడం కలలోని మాట. అందుకే తిరుగుబాటు చేశాను. నన్ను క్షమించు అన్నయ్యా! బంధుత్వ రీత్యా నీకూ నాకూ శతృత్వం లేదు. అన్నగా నేను నిన్నెప్పుడూ గౌరవిస్తాను." అన్నాడు ఉగ్రరూప యాదవుడు.

"నువ్వు చిన్నవాడివి. రాజ్యాధికార నిర్వహణ చాల కష్టం. అధికారం అంటే బాధలు, సమస్యల మయం. వాటిని తట్టుకుని నిలబడగలగాలి. నీకు కొంచెం అనుభవము వచ్చిన తర్వాత కావా

లనుకుంటే నువ్వే తీసుకో. అందుకు దేశాటన చేసి అనుభవాన్ని గడించి రా! ఈ రాజ్యం నీదనుకుంటే నువ్వే తీసుకో." అని శాంతి స్వరూప్ యాదవ్. సింహాసనం దిగి అతని దగ్గరికి నడిచి వచ్చి సంకెళ్ళు విడిపించాడు. ఈ చర్యకు సభ యావన్మంది ఆశ్చర్యపడ్డారు.

"లేదన్నయ్యా! నువ్వుండగా రాజ్యం నాకు రాదు. నువ్వు చెప్పిన మాటలు వినసొంపుగానే వున్నాయి. కార్య రూపం దాల్చవు. ఈలోగా నువ్వు సింహాసనాన్ని సుస్థిరం చేసుకుంటావు. నాకు అవకాశమే వుండదు. నీ తర్వాత నీ కొడుకు రాజ్యానికొస్తాడు. మీకు సేవ చేసుకుంటూ గడపడం తప్ప గత్యంతరం వుండదు." ఉగ్ర రూపుడు జవాబు చెప్పాడు.

"కాదు నాయనా! నా మాట నమ్ము. కావలిస్తే మంత్రి సామంతుల సాక్ష్యంతో పత్రాలు వ్రాసు కుందాము. మనలో మనకు శతృత్వం వద్దు. సమర్థవంతంగా రాజ్యం నువ్వు పాలించినా, నేపాలించినా ఒకటే!" "కుదరదుగాక కుదరద న్నయ్యా! నాకిప్పుడే ఈ క్షణమే రాజ్యం కావాలి నువ్వో! నేనో ఒక్కరిమే గద్దెపై వుండాలి. నువ్వు అయినా చావాలి. నేనైనా చావాలి. ఒక్క వరలో రెండు కత్తులు ఇమడవు. నన్ను ఎన్ని జైళ్ళు తిప్పి ఎక్కడ ఖైదు చేసినా నా ప్రాణం పోయేవరకూ పోరాడుతూనే వుంటాను." ఉగ్రరూప యాదవుడి సమాధానంతో శాంతిస్వరూప్ యాదవుని బుర్ర తిరిగింది. ఎన్ని విధాల చెప్పినా అతను వినిపిం చుకునే స్థితిలో లేడు. శాంతిస్వరూప్ ఆలోచ నలో పడ్డాడు.

"సరే! నాయనా! నీకు రాజ్యం కావాలి. నాకు నీ ప్రేమ, ప్రజల క్షేమం అన్నీ కావాలి. రాజ్యం మీద శతృవుల నీడ పడకుండా వుండాలంటే మనలో మనం యుద్ధం చేసుకోవడం బాగుగా



లేదు. ఈ రాజ్యాన్ని ఈ క్షణమె నికు దారాదత్తము చేస్తున్నాను."

"మహారాజా! ఆగండి!! రాజ్యాన్ని ఇంకొకరికి ఇవ్వడం మీరు చెయ్యకూడదు. ప్రజలు చెయ్యాలి." సభలో నుండి గట్టిగా అరిచారు కొందరు!

"మీరేమనుకున్నా నేను చెయ్యాలనుకున్నది చేస్తున్నాను. దయచేసి నా మాట మీద గౌరవం వుంటే మారు మాట్లాడవద్దు."

"మీకు బాధగా లేదా!" మరెవరో అన్నారు సభలో.

"ఉంది నాయనా! తప్పదు. నా ధర్మం నేను చేస్తున్నాను." అంటూ మహారాజు శాంతిస్వరూప్ యాదవుడు మంత్రి సామంతులకు ఉగ్రరూప యాదవుడిని రాజును చెయ్యమని ఆజ్ఞ యిచ్చాడు.

పురోహితులు మంత్రాలు చదువుతూ వుండగా, కన్యకామణులు అతనిపై పూల వర్షం కురిపించగా, శాంతి స్వరూపుడు తన తలపైనున్న కిరీటాన్ని తీసి తమ్ముడైన ఉగ్ర రూప యాదవుడిని తోడ్కొని సింహాసనం మీదికి తీసు కుని వచ్చి అధిష్ఠింపజేశాడు.

ప్రజలవైపు తిరిగి జేజేలు పలికించాడు.

అంతో రాణి తిరుమలాదేవి, కుమారుడిని తీసుకుని భర్తను సమీపించింది.

భార్యను, కొడుకుని తీసుకుని ప్రజల్ని, మంత్రి సామంతుల్ని విడిచి బయట వైపు నడవడం మొదలు పెట్టాడు.

సభ యావత్తు ఆశ్చర్యం! ఊహించరాని దృశ్యం. ఎవరి నోట మాట లేదు.

ఎవరు ఏమి చెయ్యడానికీ పాలు పోలేదు.

ప్రధాన మంత్రి బుద్ధిశాలి యాదవ్.

"మహారాజా! ఆగండీ! మీ వెంటే నేనూ - నాకీ ప్రధాన మంత్రి పదవి అక్కర లేదు. మీరు అడివిలో వుంటే నేనూ అక్కడే!" అంటూ రాజ దంపతులను అనుసరించాడు.

"మేమూ, మీవెంటే" అంటూ మంత్రి సామంతాదులు ప్రజలు రాజదంపతుల వెంట బయలుదేరారు.



సభా ప్రాంగణంలో ఒక్కరూ లేరు. సింహాసనం మీద కిరీట ధారియై వున్న ఉగ్ర రూప యాదవుడు కొయ్యబారి పొయ్యాడు.

అన్న మీద ప్రజలకున్న అచంచలమైన ప్రేమ భక్తి, విశ్వాసం అతనికి అప్పుడు అర్ధమయ్యింది. అతన్ని ఈ దృశ్యం కుదిపి వేసింది. సింహాసనం మీద ముళ్ళ మీద కూర్చున్నట్టుగా వుండి గబుక్కున లేచి కిరీటాన్ని చేతిలోకి తీసుకుని అన్న వెనకాలే పరుగెత్తుతూ "అన్నా! ఆగు!" అంటూ అతని ఎదురుగా వెళ్లి అందరూ చూస్తూ వుండగా అతని కాళ్ళమీదపడి. "అన్నా! నన్ను క్షమించు. మిమ్మల్ని మీ ప్రజాభిమానాన్ని, మీ శక్తిని అర్ధం చేసుకోలేకపోయాను. కరుడు కట్టిన నా రాజ్యకాంక్ష కరిగి పోయింది. జీవితాంతం మీకు, ప్రజలకు సేవ చేసుకుంటూ బ్రతుకుతాను" అంటూ వేడుకున్నాడు.

శాంతి స్వరూప్ యాదవుడు అతని భుజాలు పట్టుకుని లేవదీసి కౌగలించుకుని భార్యా బిడ్డలతో వెనుదిరిగాడు.

అపకారికి ఉపకారం చెయ్యడమే గొప్ప. అపకారమును పొందిన వారు సహనంతో ఓర్పుతో ఆ అపకారాన్ని క్షమించ గలిగి ఉపకారం చేసినప్పుడు అతనే మహాత్ముడు. ఈ ప్రపంచం వున్నంతవరకూ కీర్తిస్తారతన్నందరూ! ❋





# రాజే కావాలి

ఒక రాజుకు తన మీద ప్రేమను చూపే బంధువులు, అధికార వర్గం మీద "వారు చూపుతున్నది నిజమైన ప్రేమా లేక నా సంపద మీదున్న ప్రేమా" అనే అనుమానం కలిగి వారిని పరీక్షించుటకు ఒకరోజు తనఖజానాలోని అమిత విలువగల అత్యంత సుందరమైన వస్తువు లనేకం పట్టుకొచ్చి ఒక మైదానంలో పెట్టించి, రాజు కూడా వాటి మధ్య కూచొని "ఈ రోజు సూర్యాస్తమయంలోపుగా ఇక్కడున్న వాటిలో ఎవరికి కావలసిన వాటిని వారు పట్టుకపోవచ్చు! కాని వెళ్ళే ముందు రాజు అనుమతితోనే వెళ్ళాలి" అని చాటింపు వేయించాడు. అదివిన్న మంత్రులు, అధికారులు, బంధుజనం తది తరులు ఒకర్నొకరు తోసుకుంటూ తమకు కావలసిన వస్తువులను చేతబట్టుకొని "రాజు యొక్క అనుమతితోనే వెళ్ళాల"లనే నిబంధన వలన మైదానంలోనే అటూ ఇటూ తిరగసాగారు. మైదానం చాలా సందడిగా ఉంది. ఎవరికి కావలసినవి వారు తీసుకుని భద్రపరుచుకుని రాజుగారి అనుమతి ఎప్పుడు లభిస్తుందా! ఈ వస్తువులు తమ స్వంతం చేసుకుందామా!" అని ఆత్రంగా ఎదురు చూడసాగారు.

ఇంతలోనే అక్కడకొక పల్లెటూరి అమ్మాయి వచ్చి సరాసరి రాజు ఆసీనుడైన ఆసనం దగ్గరకెళ్ళి "మహారాజా! మీ చాటింపు విన్నాను! ఈ మైదానంలో ఉన్న ఏదైనా అడిగి తీసుకోవచ్చు అనే మాటకు మీరు కట్టుబడతారా!" "అయినా నీకా సందేహమెందుకొచ్చింది?" అన్నాడు. అప్పుడాగడుసు పిల్ల "ఏమీ లేదు మహారాజా! అడిగే ముందు ఖాయం చేసుకుందామనుకు

యం. సుభాన్ - కె. నిడిమామిడి

న్నాను" అన్నది. "సరే నీకిష్టమొచ్చింది అడిగి తీసుకో" అన్నాడు రాజు ఆమెవంక వింతగా చూస్తూ. "మహారాజా! ఈ మైదానంలో వున్న ఏ వస్తువులూ వద్దు మీరే కావాలి" అని మృదువుగా అన్నది ఆ పల్లె పడుచు.

ఆ మాటలు విన్న మైదానంలోని వారు ఆశ్చర్యచకితులైనారు, అంతేకాదు అక్కడున్న అధికార వర్గంలోని వారు. "ఏయ్! అమ్మాయ్! ఒళ్లు దగ్గరుంచుకొని మాట్లాడుతున్నావా!" అన్నారు.

రాజు మాత్రం మందహాసంతో "అన్ని వస్తువులతో పాటు నేనుకూడా ఈ మైదానంలో ఆసీనుణ్ణై ఉన్నాను కదా! మీ అందరికీ నామీద కన్నా నా దగ్గరున్న ధనం మీద వస్తువుల మీద ఎక్కువ అభిమానముంది. కాబట్టి వాటినే ఎన్నుకున్నారు. చేజిక్కించుకున్నారు. ఈ అమాయకురాలు నా మీదున్న ఇష్టంతో అక్కడున్న ధనరాశులను వస్తువులను తృణప్రాయంగా భావించి నన్నే కోరుకున్నది. ఇప్పుడు ఆడిన మాట తప్పేమీ లేదు. ఆ అమ్మాయి కోరిక ననుసరించి నేను ఆమెకే చెందుతాను కనుక ఆమెను రాణిగా స్వీకరిస్తాను. ఇక నా వస్తువులు, నా అధీనంలో ఉన్న మీరందరూ కూడా ఆమెకే చెందుతారు కనుక ఆ వస్తువులన్నింటినీ ఆమె కప్పగించి వెళ్లండి" అని తీర్మానించాడు. రాజ్యాధీశుణ్ణే మరచి అక్కడున్న సంపదకు ప్రాకులాడినందుకు అధికారులు, బంధువులు, తమలో తామే సిగ్గుపడ్డారు.





# చెప్పింది చెయ్యండి!

కాంచీపురంలో నున్న ఒక విజ్ఞాన వంతుడైన గురువుగారు తన ఆశ్రమంలో నున్న శిష్యులతో తాను చెప్పింది మాత్రం చేయాలని, కాని, తాను చేసింది చేయరాదని చెప్పారు.

ఒకరోజు గురువుగారు శిష్యులతో కలసి పేకాట ఆడారు. ఆడుతూ ఒక ముక్కను తీసుకొని చాటుగా, కార్డులతో కలిపి గెలిచారు.

అది చూచి ఒక శిష్యుడు కూడా ఎవరూ చూడకుండా ఒక కార్డు మార్చుకున్నాడు!

గురువుగారది గ్రహించి, శిష్యునకు చీవాట్లు పెట్టి అలా చేయకూడదన్నారు.

కాని గురువుగారే స్వయంగా అలా చేసినప్పుడు తానెందుకు చేయకూడదు అనే సందిగ్ధంతో గురువుగారినే అడగాలని నిర్ణయించుకున్నాడు.

అది తెలుసుకొని గురువుగారు శిష్యులందరినీ సమావేశపరచి ఈ కథ చెప్పారు.

"ఒకసారి ఒక సద్గురువు శిష్యులతో బయలుదేరి వెళుతూ మార్గంలో మిఠాయిలు అమ్మే యింటికి వెళ్ళాడు. అక్కడ వున్న పళ్ళెంలో ఉన్న లడ్డూలలో ఒకటి మాత్రం తీసుకొని తిన్నారు గురువు.

వెంటనే ఉన్న శిష్యులందరూ తలొక లడ్డూ తీసుకొని తిన్నారు.

గురువుగారి అనుమతిగాని, మిఠాయి కొట్టు యజమాని లడ్డులు ఇచ్చేవరకు ఎదురు చూడకుండానే శిష్యులందరూ లడ్డూలు తీసుకొని తినేశారు.

అంతట గురువుగారు అక్కడి నుండి కొలిమిలో సీసం కరిగిస్తున్న కంసాలి శిష్యుని యింటికి వెళ్ళారు.

అక్కడ మూసలలో కరిగించి యున్న సీసం ద్రవాన్ని తీసుకొని త్రాగేశారు.

శిష్యులందరూ - ఏమి చేయాలో తోచక ఒకరి నొకరు చూస్తూ నిలబడిపోయారు.

అంతట గురువుగారు - "కానీయండి, సీసం కూడా త్రాగేయండి లడ్డూలు తిన్నారుగదా! ఇది గూడా త్రాగాలి!' అనేసరికి.

శిష్యులు వారి తప్పిదాన్ని గ్రహించి క్షమాపణ వేడుకొన్నారు.

"అందువలన గురువులు చేసింది చేయరాదు. చెప్పింది మాత్రమే చేయాలి" అని గురువు శిష్యులకు చెప్పారు.❋

భీమవరపు సంగీతరావు - విశాఖపట్నం



# గురు బోధ

ఊరికి దూరంగా వున్న ఒక ఆశ్రమంలో ఒక గురువుగారు, తన శిష్యులకు జ్ఞాన బోధ చేస్తూ కాలం వెళ్లబుచ్చుతున్నారు.

ఒక రోజు రాత్రి అకస్మాత్తుగా కొందరు దుండగులు.... ఆ ఆశ్రమంలోకి చొరబడ్డారు. నిదురిస్తున్న వారినందరినీ కాళ్లతో తంతూ, బిగ్గరగా కేకలు వేస్తూ, వికటంగా నవ్వుతూ, నానా భీభత్సం చేశారు. ఆశ్రమంలోని వస్తువులన్నింటినీ చెల్లా చెదురుగా విసిరేసి, పూల మొక్కలన్నింటినీ పీకి పారేశారు. ఎదురు తిరగబోయిన వారిని కత్తులతో గాయపరచారు. అంతా భయంతో వణికిపోతుంటే వారిని చూచి ఆనందంగా గెంతులు వేస్తూ వెళ్లిపోయారు.

ఈ సంఘటన జరిగిన రెండు రోజుల తరువాత... గురువుగారు హితోపదేశం చేస్తుండగా ఒక శిష్యుడు అడిగాడు.... "స్వామీ! మనమే పాపము ఎరుగం కదా, మొన్న రాత్రి ఆ దుండగులు మనల్ని అట్లా హింసించి పోవడం న్యాయమేనా? వారికి శిక్ష వుండదా?"

గురువు గారు ఒక్క క్షణం ఆలోచించారు. అప్పుడే ఎక్కడినుంచో ఒక పిల్లిని తరుముకుంటూ ఒక కుక్క ఆ ఆశ్రమంలోకి ప్రవేశించింది. వెంటనే ఒక శిష్యుడు లేచి ఆ కుక్కని ఒక రాయితో కొట్టి అక్కడనుంచి వెళ్లగొట్టాడు. గురువుగారు ఎదురుగా వున్న శిష్యుడితో ఇలా అన్నారు.

"చూశావా....! ఈ పిల్లి ఏ తప్పూ చేయలేదు. ఆ కుక్క జోలికసలు పోనే లేదు. అయినా ఈ పిల్లిని చూడగానే దానిపై దాడికి పూనుకుంది కుక్క. అది ఆ కుక్క సహజ లక్షణం. ఈ లోకంలో దుర్మార్గులు అతి సహజమైన తమ దుర్గుణాలని ఎల్ల వేళలా ప్రదర్శిస్తూనే వుంటారు. మంచి ఎప్పుడూ చెడు జోలికి వెళ్లదు కానీ చెడు ఎప్పుడూ మంచిని బాధించడానికే ప్రయత్నిస్తుంది. చెడు పనికి ఆ కుక్కకి రాయి దెబ్బ తప్పనట్టే.... అమాయకులను హింసించినందుకు ఆ దుండగులు కూడా ఏదో ఒక శిక్షను అనుభవించే సమయం వస్తుంది" అన్నారు. ❋

# బుస్సీకాట్ - డేంజర్ రాట్

కథనం : చేబ్రోలు

బొమ్మలు : సీతారామ్













కుదరదంటే నీగతి ఏమవు
తుందో చూసుకో.....!
అయితే కానీండి!
నాకేంటి భయం!
సరే నీ పని చూస్తా.....!


ఒరే సైనికుల్లారా! ఆ పొగురుబోతు
ఎలుక గాడిని బాంబులతో చంపెయ్యండి! వాడి
నూనె బావులన్నీ బాంబులేసి కాల్చేయ్యండి!


నూనెల రాజ్యంలో బాంబింగ్ చేసారు! భయంకరంగా నష్టం
కలిగింది! పిల్లా జెల్లా పారిపోయారు! బాంబులదాడికి
తట్టుకోలేని డేంజర్‌రాట్ కొండ గుహల్లో దూరేసాడు!


సార్! ఎన్నో బాంబులు. ఆ రాజ్యంలో వేసి చాలా నష్టాన్ని
కలిగించాం! కానీ డేంజర్ రాట్ ఆచూకీ తెలియలేదు!
ఇంకా బాంబులు వేసి ఊళ్లన్నీ
తగుల బెట్టండి! వాడే బైటకొస్తాడు!


బాంబుల దాడితో నూనెల
రాజ్యం అన్ని విధాలా నష్టపోతోంది!


డేంజర్ రాట్ ప్రతీకారంగా అయిలాండ్ మీద
భయంకరమైన నాటుబాంబులు విసిరాడు!


అయిలాండ్ వీధుల్లో జంతు
జనం పీనుగులై పోగుపడ్డాయి!


అయిలాండ్ రాజభవనం
గూడా కూలి పోయింది!


సరే వోయ్! యుద్ధం ఆపండి! ఇప్పటికే చాలా నష్టపోయాం!
యుక్తితో సాధిద్దాం!


ఏమయ్యా డాంకీ రాయబారి గారూ! మనదేశానికి ప్రజలకు, ఆస్తులకీ చాలా నష్టం కలిగింది యిప్పుడేమిటి చెయ్యటం?
ముందు యుద్ధం ఆపించండి! ఆ డేంజర్ రాట్‌గాడ్ని నేను పట్టుకొచ్చి మీ ముందు పెడతా!


ఏమోయ్! నువ్వో పెద్ద హీరోవా! గట్టిగా కొరికితే ఒక పంటి కిందకు రావు...! ఏమిటీ నీ రౌడీయిజం!
రాట్ నోట్లో నుంచి తుపాకీ పేల్చాడు! కాట్ చెవుల్లోనుంచి మెదడులోకి వెళ్లి పోయింది!


ఒరే వెధవాయ్! చివరకు యిద్దరం చస్తున్నాం! సాధించే ముంది! నాశనం తప్ప!
గురూ! నేను చస్తే చచ్చాగానీ..... నిన్ను గూడా మంటల్లో మాడ్చేస్తున్నా!
ఇద్దరం చచ్చిపోతున్నాం! గుడ్ బై....!



# అందాల సింద్రెల్లా

అనగనగా సింద్రెల్లా
అనే ఒక్క బాలిక
ఉండెనామె అందానికి
సన్నజాజి పోలిక!

అయితే ఆమెకు మాత్రం
తల్లిలేదు పాపం!
అయినా తండ్రికి తనపై
ఎంతో గారాబం!

ఉండి ఉండి ఒక్కనాడు
ఉపద్రవం వచ్చె
తండ్రి పెండ్లి చేసుకొనెను
కొత్తమ్మను తెచ్చి.

ఆమెతో వచ్చిరి యింటికి
ఇద్దరు కూతుళ్లు
సింద్రెల్లా అంటె వార్కి
మహా పరమ కుళ్లు.

వారొచ్చిన రోజు నుండి
సింద్రెలాకు పాపం
ముచ్చటైన తనయిల్లే
మహా నరక కూపం.

పనిమనిషీ వంట మనిషి
అన్ని సింద్రెల్లాయే
తండ్రికి తెలియదు ఏమీ
ఇల్లే బైలాయె.

ఇలా వుండ ఒక్కనాడు
ఆ ఊరికి రాజు
పిలిచినాడు మూడు నాళ్ల
విందుకి ఆ రోజు.

అక్కా చెల్లెళ్లిద్దరు
చెక్క బొమ్మలల్లె
షోకు చేసుకుని వెళ్లిరి
తురిమి బొండుమల్లె.

దిగులు పడుచు సింద్రెల్లా
నిట్టూర్పుచునేడ్చె
దివ్యకాంతి ఒక్కటి మీరి
మిట్లు గొలుప చూచె

ఎదురగ నిల్చిన దేవత
మధురముగా నవ్వి
"ఏడువకుము, కోరుకో" అనె
"ఏం కావాలవ్వి!"

"నింజగాన? అయితే నాకు
రాజు విందుకడకు
వెళ్లాలని వుందిగాని
కాళ్లలోన వణుకు"

"ఇంతేగదా! ఓస్! మహా
ఇదేం పెద్ద పనియా?
తోటలోకి వెళ్లితెమ్ము
దోరగుమ్మడి కాయ"

నిశాపతి - హైదరాబాదు

దేవి చెప్పినట్లె తెచ్చె
సింద్రెల్లా అమ్మడు
తన బంగరు దండంతో
తాకె దేవి గుమ్మడు.

ఆశ్చర్యం! గుమ్మడాయె
గుర్రబ్బగ్గీగా
సింద్రెల్లా కళ్లల్లో
చిన్నమెరుపు తీగ!

"ఎలుకల బోనులో పడినవి
ఎలుకలారు తెమ్మ
తమాషాను చూపిస్తా
నా మాటను నమ్మ!"

దేవి చెప్పినట్లె చేసె
తేనెల సింద్రెల్లా
దండముచే గుర్రాలుగ
మారె ఎలుకలెల్ల

సారథిగా మారిపోయె
వేరే ఒక ఎలుక
గోడ మీ బల్లులారు
నౌకర్లయి పలికె

చిరుగు బట్టలన్ని చీని
చీనాంబర లాయె
సింద్రెల్లా రాకుమారి
ఠీవి మెరసిపోయె

"విందుకు నీవిక వెళ్లుము
వేగిరమే రమ్ము
పన్నెండయ్యాక చూడు
నా మహిమల్ల వమ్ము.

"మంచి" దనుచు పలికితాను
మాయమాయెదేవి
సింద్రెల్లా మనసంతా
ఆనందపు తావి!

కోటలోకి వెడలె తీపి
మాటల సింద్రెల్లా
అందానికి ముగ్ధులైరి
అచ్చటి జనులెల్లా!

ఎదురు వచ్చి రాజుకొడుకు
ఆహ్వానము పలికె
సింద్రెల్లా అందానికి
ఆనందం మనసు చిలికె

చేయి చేయి కలిపి ఆడ
హాయిగ జనులెల్లా
రాకుమారు చూపునుండి
మరలదు సింద్రెల్లా

పన్నెండవుతుందనగా
తెలివి వచ్చి తనకి
సింద్రెల్లా మాయమాయె
బండిలోకి దుమికి!





రెండో రోజున గూడా
రాణిలాగ వెలిగి
తృటిలో తప్పించుకొనియె
జనులకన్ను మలగి

మూడవ రోజున మాత్రము
ముద్దుగుమ్మ సిండ్రెల్లా
బయట పడేవేళ వరకు
పన్నెండవనే ఆయెను.

తత్తర పాటున కోటను
తన జోడొక్కటి వూడెను
దాని వదలి పరిగెత్తెను
కానీ సమయము మీరెను

బండి లేదు బంట్లు లేరు
పట్టుబట్టలసలు లేవు
ఏడ్పువచ్చె సిండ్రెలాకు
గుండె ఆయె చెరువు

కాళ్లీడ్చుకొనుచు యిల్లు
చేరె ముద్దుల సిండ్రెల్లా
'తన భాగ్యము ఆ మాత్రమె,
జరుగున తలచిన దల్లా!'

సిండ్రెల్లా కానబడక
చింతిస్తూ రాకుమరుడు
అతని కోటనంత వెతికె
అంగుళమైనా వదలడు

కోటలో దొరికిన స్ఫటికపు
జోడు నతడు పోల్చుకొనెను
ఆ జోడెవరిదో తెలియగ
జాడ తీయుమ నడిగెను.

ఇల్లిల్లూ వెదుక్కుంటు
సిండ్రెల్లా యిల్లు గూడ
వెదకుటకై వచ్చినారు
రాజభటులు తీయజాడ

అక్కాచెల్లెల్లిద్దరి
వెక్కువాయె పాదమ్ములు
సిండ్రెల్లా వేసుకొనగ
చిందెనవే అందమ్ములు

దేవత ప్రత్యక్ష మౌచు
దీవించెను సిండ్రెలాను
రాజ మహలులో పెండిలి
వైభోగముగా జరిగెను!

తన కలలో మూర్తి తనకు
దొరుకునట్లు చేసినట్టి
స్ఫటికపు జోడుకు రాజే
ర్పరచె చందనంపు పెట్టె

దానిని అపుడపుడు చూస్తు
తలపోస్తూ గత చరిత్ర
సిండ్రెల్లాయును రాజును
చిరకాలము సుఖించిరి!!



1966లో పంజాబ్ నుంచి వేరు చేసి హర్యానా రాష్ట్రాన్ని ఏర్పరిచారు

బుజ్జాయి
# మినీ న్యూస్
BUJJAYI MINI NEWS

సంపుటి : 7 | డిసెంబర్ - 2001 | నిర్వహణ : సినారా | సంచిక : 12

## అమ్మ - ఆయుధం

మాతృమూర్తి మమకారానికి సాటయినది ఈ సమస్త విశ్వంలో మరేదీ లేనేలేదు. అమ్మ అనురాగం అమూల్యమైనది. కన్నబిడ్డల కోసం తల్లులు ఎందుకైనా సిద్ధపడతారు. తమ ప్రాణాలను అర్పించైనా పిల్లలను కాపాడుకోవాలనుకుంటారు.



కన్న పేగు అనుబంధం అలాంటిది. అనుక్షణం ఆత్మీయతను పంచిపెట్టే తల్లుల రుణం తీర్చుకోవటం తరమా? ఉడతాభక్తిగా అన్నట్టు 'మాతృమూర్తుల దినోత్సవం' (మదర్స్ డే) పేరిట ఏటా వివిధ దేశాలు తోచినరీతిగా కార్యక్రమాలు నిర్వహిస్తున్నాయి. అందులో భాగంగా దక్షిణకొరియా సైన్యం వినూత్నరీతిలో సిపాయిల తల్లులకు మాత్రం మూడురోజులపాటు సాయుధ శిక్షణ నిచ్చింది.

## వేలి ముద్రలతోనే వ్యవహారాలు!

వినియోగదారుల సౌకర్యం కొరకు వ్యాపారస్థులు, ఆర్థిక సంస్థలవారు, బ్యాంకులవారు వారి వారి వ్యాపార విస్తరణ కొరకు క్రెడిట్ కార్డులు, ఆటోమేటిక్ మనీటెల్లర్స్, టోకెన్ సిస్టం వగైరా ఎన్నో సౌకర్యాలు కల్పిస్తున్నారు. అయితే యిందుకు దొంగదారులు వెతికేవారున్నారు. ప్రతి దానికీ డూప్లికేట్ పద్ధతుల్లో క్రెడిట్‌కార్డుకు డూప్లికేట్, టోకెన్స్‌కు



## నిధుల సేకరణకు పలు మార్గాలు

చందాలు వసూలు చేయటం, మామూళ్లు దండుకోవటం వగైరాలన్నీ యాచన కిందకే వస్తాయి. యాచన పలు రకాలు. అలాగే దాతలూ పలురకాలు. మంచి పని కోసం నిధులు సేకరించాలన్నా వినూత్నంగా ఆకట్టుకోవడం, భారీ ప్రచారం అవసరమవుతున్న కాలమిది. అందుకే కాబోలు కాంబోడియా రాజధాని నామ్‌ఫెన్‌లో ఒక అనాథాశ్రమం కోసం పాత మద్యాన్ని (ఓల్డ్ వైన్‌ను) వేలం వేసి డబ్బులు పోగేశారు. ఆ కార్యక్రమానికి హాజరయిన ప్రముఖులు-సెనెటర్ జాన్ కెర్రీ (మధ్యలో), అమెరికన్ రాయబారి కెంట్ వీడె మన్ (కుడివైపు) ఆ వైన్ బాటిళ్లు ఏనాటివో పరిశీలిస్తున్నారు. నామ్‌ఫెన్ శివారులో ఖ్మెర్‌రోజ్ హయాంలో నెలకొల్పిన అనాథాశ్రమానికి యాభై వేల డాలర్లు సేకరించాలన్నది లక్ష్యం కాగా వైన్ వేలం పాట ద్వారా 17 వేల డాలర్లు చేకూరాయి. అపాత్రదానం కాదు ఇది-అనాథలకు సాయం అని నిర్వాహకులు బాగా ప్రచారం చేయడంతో మందు అలవాటు లేని దాతలు కూడా వచ్చి భారీమొత్తాలు ఇచ్చి వెళ్లారట!



కొచ్చుశాయి! ఈ డూప్లికేటల బెడద తప్పించుకోవటానికి అమెరికాలోని ఇండివోస్ సంస్థవారు వేలి ముద్రల ద్వారా అన్ని ఆర్థిక లావాదేవీలను జరిపేలాగు తంబ్ యింప్రెషన్ మిషన్లు తయారుచేసి విడుదల చేసారు. ఈ వేలి ముద్రల మిషన్ల వలన మోసాలు చేయటం కుదరదు. అందరి వేళ్లపై ముద్రలు ఒక లాగుండవు. వేళ్లపై నున్న కేశ (వెంట్రుకవాసి) రేఖలు ఒకో మనిషికి ఒకోరకంగా వుంటాయి. అందువలన ఈ వేలిముద్రల మిషన్లో డూప్లికేట్ మోసాలు చేయటానికి వీలుపడదు. పై నున్న చిత్రంలో వేలిముద్ర ద్వారా ఆర్థిక లావాదేవీలన్నీ జరిపే పరికరాన్ని ఇండివోస్ సంస్థవారు తయారుచేసి, ఈ యంత్రంను ఉపయోగించి సుమారు యాభైవేల వ్యవహారాలు సజావుగా ఏ అవకతవకలు లేకుండా జరిగినట్లు తెలుసుకున్న తర్వాత దీన్ని వెలికి తెచ్చారు. ఈ పరికరంవల్ల ఎన్నో ప్రయోజనాలున్నాయని తెలుసుకున్న బ్రిటన్, జపాన్, ఆస్ట్రేలియా, సింగపూర్, మలేసియా, హాంకాంగ్ మొదలైన దేశాల వారు దీన్ని ఉపయోగించ టానికి సుముఖత చూపారు. ఈ దేశాల వారికి ఈ మిషన్ బాగా ఉపయోగపడిందంటే మిగిలిన దేశాలవారు గూడా ఈ మిషన్‌ను ఉపయోగించుకుని నకిలీల బెడద నుంచి తప్పించుకోవచ్చు!

## తల్లి అయినా ఆసక్తి తగ్గలేదు...!

ఇంటిలో అదనపు సమస్యలున్నా బయట ప్రపంచంలో తమకు తామే సాటి అని మహిళలు నిరూపించుకుంటున్నారు. మనుషుల్లోనే కాదు ఇతర జంతుజాలాల్లోనూ ఈ ప్రత్యేకత గోచరిస్తోంది. క్యోటో యూనివర్సిటీ (జపాన్) లోని ఇనుయామా ప్రైవేట్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ అధికారులు ఇటీవలే ఓ పరిశోధనలో ఈ నిజాన్ని కనుగొన్నారు. కంప్యూటర్‌లో రకరకాల క్విజ్‌లను గ్రహించే అయిన్ అనే చింపాంజీ ఇటీవలే ఓ బిడ్డకు జన్మనిచ్చింది. ఆ సందర్భంగా కొంతకాలం పాఠాలకు హాజరుకాలేదు అయిన్. ఇప్పుడు రెండు వారాల కూనను చంకనెత్తుకుని (ఫోటోలో చూడండి) యథావిధిగా తన పరిజ్ఞానాన్ని పెంపొందించుకుంటోంది. తల్లి అయిన అయిన్ తన సామర్థ్యాన్ని మరింత పెంచుకుంటుందే గానీ ఏ మాత్రం తగ్గలేదని సంస్థ అధికారులు తెలిపారు.

# యుద్ధ.కామ్




నూట పది అంతస్థులే.. దెబ్బకి కుప్పకూలాయ్! నీ బోడి పిచ్చుక గూడు.. ఓ లెక్కా..?!


మీ భూతల యుద్ధాన్ని చూసి.. ఈ ఇంటి ఓనరు.. పాకిస్థాన్ బార్డర్ చేరి ఉంటారు.. మమ్మీ—!!


ఈ కంప్యూటర్ యుగంలో.. బుట్టలు, జుంకలు, మావటీలా... నో..నో.. మిస్సైల్స్, స్కడ్ మోడల్స్ చేయించు.. పెట్టుకొంటా..


ప్రస్తుత ప్రపంచ జనాభా ఎంతరా ఛరణ్?
టీవీ న్యూస్ చూసి రేపు కరక్ట్‌గా చెబుతా సార్..!!


ఆ యుద్ధ విమానాన్కి ఇంధనం ఎలా ఎక్కిస్తున్నారో... అలాగే నాకు పాలు త్రాగించు మమ్మీ.. కమాన్..!!


మొదటి ప్రపంచ యుద్ధం జరిగింది 1920 అని వీడు, కాదని కింద వాడు యుద్ధం చేస్తున్నారు.. సార్..!!



 

# సత్యం - శివం - సుందరం



చేనేత బంధు శ్రీప్రగడకోటయ్య మెమోరియల్ హై స్కూల్ పేరాల పొలిమేర రోడ్ దాటిన చీరాలలో మహాత్మాగాంధీ క్లాత్ మార్కెట్ సెంటర్ లో ఉంది . సెకండ్‌ఫారం విద్యార్థులు. సత్యం, శివం, సుందరం. వారు ముగ్గురూ దరిదాపు ఒకే ఈడు వారు. ఒకే బెంచిలో వరసనంబర్లు వారివి. సత్యం నిరుపేద కుటుంబానికి చెందిన వాడు. కష్టించి కూలిపని చేస్తూ ఒక్కగానొక్క కొడు కును చదివించుకుంటున్నాడు తండ్రి పెరుమాళ్లు. సత్యం ఆకలి కడుపుతో, స్కూలుకు వస్తూ, పస్తులను మరచి పట్టుదలతో చదువుతూ క్లాస్‌లో అందరికన్నా మిన్న అన్పించుకుంటున్నాడు. శివం కోటీశ్వరుని బిడ్డ. పట్టణంలో పేరు పొందిన పర్నిచర్ షాపు ప్రొప్రయిటర్. శివం తండ్రి అమృతరావు. సుందరం మధ్య తరగతి కుటుంబానికి చెందిన రమణరావు రెండవ సంతానం స్టేట్ బ్యాంక్ మెసింజరుగా చేస్తూ వచ్చే జీతం రాళ్ళతో కుటుంబాన్ని నెట్టుకు వస్తున్నాడు. శివంలో ధనవంతుణ్ణి అనే అహం ఉంది. క్లాస్ టీచర్ హర్షవర్ధన శాస్త్రి శివాన్ని క్లాస్ లీడర్‌ను చేశాడు.

ఒక రోజు మామూలుగానే క్లాస్ జరుగుతుంది ఒకటవ పీరియడ్ తెలుగు, రెండవ పీరియడ్ ఇంగ్లీష్ ముగిశాయి. విశ్రాంతి గంట కొట్టారు. ఏడవ తరగతి పిల్లలందరూ కేరింతలు కొడుతూ హై స్కూలు గ్రౌండ్‌లోకి చేరారు. సమయం 12.15ని. కావస్తుంది. ప్రతిరోజూ తిండి లేక కడుపు కాలటం ఓర్పు వహించటం, సత్యంకు అలవాటే! కానీ ఈ రోజు ఉదయం నుండి సత్యంకు ఆకలి దహించి వేస్తూ తారస్థాయికి చేరుకుంది. మూడు రోజుల నుండి అన్నం తిన్లేదు. మంచి నీళ్ళతోటే కడుపు నింపుకుంటున్నాడు. పిల్లలు భోజనం తెచ్చుకున్న టిఫిన్ క్యారేజీలు యిరవై దాకా వరుసగా రూంలో ఉన్నాయ్. క్లాసెస్ ప్రారంభించటానికి ఇంకా పావు గంట మాత్రమే వ్యవధి ఉంది.

*కనికరపు రంగారావు - చీరాల*



వెళ్ళి మాష్టర్‌ను వెంట బెట్టుకొని క్లాస్ రూంకు వచ్చాడు శివం. విద్యార్థులందర్నీ పిలిచాడు హెడ్ మాష్టర్‌గారు. అందరు కూర్చున్నారు. హెడ్ మాష్టర్ మును స్వామినాయుడు, అందరి వైపు ఒక పరీక్షగా పరిశీలించి చూశాడు. విద్యార్థులంతా అమాయకంగా హెడ్ మాష్టారు వైపు చూశారు. కానీ సత్యం ముఖంలో ఆందోళన నిండి ఉంది. అది గమనించిన ఆయన సత్యం దగ్గరకు వచ్చి, "శివం క్యారేజీలో భోజనం దొంగిలించిన వారెవరో చెప్పండి! మొదటి తప్పుగా క్షమిస్తాను!" అన్నాడు హెడ్ మాష్టర్ సత్యం వైపు చూస్తూ. సత్యం కళ్ళల్లో నీళ్ళు తిరిగాయ్.

"మాష్టారూ! క్యారేజీలో భోజనం నేనే తిన్నాను." అన్నాడు. శివం బెంచి మీద నుండి చివ్వునలేచి, సత్యం చెంప మీద చెళ్ళుమని కొట్టి పళ్ళు పట పటమని కొరుకుతున్నాడు. హెడ్‌మాష్టరు రివ్వున వెను తిరిగి. డస్క్ మీద ఉన్న ఫ్రేం బెత్తం చేతిలోకి తీసుకొని సత్యంను పిలిచాడు. సత్యం నిలువెల్లా వణుకుతూ మాష్టారు ముందుకు వచ్చి చేతులు కట్టుకొని నిలబడ్డాడు. శివంకు సైగ చేశాడు. హెడ్ మాష్టరు. శివం, సత్యంకు ప్రక్కగా వచ్చి నిలబ డ్డాడు ఫ్రేం బెత్తం శివం చేతికందించాడు హెడ్ మాష్టరు. అంతా చూస్తున్న సుందరంకు సత్యంపై జాలి వేసింది. బెంచి మీద నుండి లేచి పరుగు నడకతో, సత్యం ముందుకు వచ్చి అడ్డుగా నిల్చుని "శివం! వాడు చాలా బలహీనంగా ఉన్నాడు. కొట్టే దెబ్బలకు తట్టుకోలేడు. వాణ్ణి కొట్టకు. నన్ను కొట్టు. మా యింట్లో నాకది అలవాటే." అని ప్రాధేయ పడ్డాడు సుందరం! "వాడు నేరం చేశాడు. వాడే శిక్ష అనుభవించాలి!" అన్నాడు శివం. "నేరం వాడిది కాదు. ఆకలిది" అన్నాడు సుందరం. శివం రెచ్చి పోయి. బెత్తంతో సత్యంను కొట్టబోయాడు. సుందరం అడ్డుకున్నాడు. శివం వెనకా ముందూ

సత్యం ఆలోచనలు ఆపి, ఆలస్యం చేయక, క్యారేజీలలోని ఒక బరువైన క్యారేజిని అందుకొని తెరచి అన్నం కూరలతో సహా అంతా తినేశాడు. ఖాళీ క్యారేజీని గబగబా మరలా యథాస్థానంలో పెట్టేసి, బైటకు వచ్చి బోరింగ్‌లో నీళ్ళు తాగాడు. దానితో అతని ఆకలి మంట చల్లారింది.

గంట మోగింది. విద్యార్థులంతా తమ తమ క్లాస్ గదుల్లోకి చేరారు. మూడవ పీరియడ్ లెక్కలు, నాల్గవ పీరియడ్ సోషల్ స్టడీస్‌తో ఆ పూటకు పీరియడ్లన్నీ ముగిశాయ్. లంచ్ బెల్ కొట్టారు. విద్యార్థులు వారి వారి టిఫిన్ క్యారేజీలు తీసుకొని వరండాలోకి వెళ్ళారు. సత్యం గుండె, దడ, దడ, కొట్టుకుంటుంది. అంతలో శివం గొంతు "నా అన్నం ఎవరో తినేశారు." పెద్దగా విన్పించింది. అలాగే అరుచుకుంటూ ఖాళీ క్యారేజి పట్టుకొని నేరుగా హెడ్ మాష్టరు రూంకి

చూడకుండా. యిద్దరినీ కొట్టాడు. బెత్తం రెండు ముక్కలైంది. శివం ముఖానికి పట్టిన చెమటను తుడుచుకుంటూ, తన సీట్‌లోకి వచ్చి కూర్చున్నాడు. "స్టుపిడ్స్! మీరూ వెళ్ళండి" అన్నారు హెడ్ మాష్టరు.

ఆ సంఘటనతో సత్యం సుందరం ప్రాణ మిత్రులైపోయారు. రోజూ సుందరం తన క్యారేజీలో అదనంగా, ఒకగిన్నెలో భోజనం తేవటం యిద్దరూ అదే క్యారేజీలో భోజనం తింటున్నారు. ఇది శివంకు మరింత ఈర్ష్యగా ఉంది. విద్యార్థులంతా సుందరంను. అభినందిస్తున్నారు.

కార్తీక పున్నమి రోజు పట్టణం నలుమూలల నుండి వేలాది భక్తులు సముద్ర స్నానానికి వచ్చారు. సెకండ్ ఫారం క్లాస్ టీచరు దుర్గారావుగారు పుణ్యం పురుషార్థం కలిసొచ్చేలా కార్తీక పున్నమి సముద్ర స్నానాలు మరియు విద్యార్థులకు ఎక్స్‌కర్షన్ రెండూ కల్సివస్తాయని చీరాల ఓడ రేవుకు తన క్లాసు విద్యార్థులందర్నీ తీసుకుని ఓడ రేవుకు వచ్చారు. జన సమర్ధంలేని ప్రదేశంలో వాళ్ళ సరంజామా అంతా ఒక చోట చేర్చి మరో టీచర్‌ను కాపలా పెట్టారు.

స్టూడెంట్స్ సముద్రంలో ఉత్సాహంతో స్నానం చేస్తూన్నారు. సముద్రంలో పది పడవలు దూరాన కన్పిస్తున్నాయ్. శివం పడవల దగ్గరకు వెళ్ళాలని అనుకుని తన వెంట తెచ్చుకున్న ట్యూబు నిండుగా గాలి నింపి నీళ్ళల్లోకి వదలి దానిపై కూర్చొని రెండు చేతుల్తో ట్యూబును నెట్టుకుంటూ, పడవలను సమీపించబోతున్నాడు. అంతలో ఉన్నట్టుండి ట్యూబులోని గాలి తగ్గిపోవటం మొదలయింది. క్షణంలో ట్యూబ్ ఖాళీ అయింది! శివంకి ఈత రాదు. నీళ్ళల్లో తేలిపోతున్నాడు. నీళ్ళల్లో రెండు మూడు స్లారు మునిగి ఆఖరి సారిగా రెండు చేతులూ పైకెత్తాడు!



అంతా చూస్తున్న సత్యం, సుదరం, అక్కడే ఉన్న కొయ్య చెక్కను నీటిలోకి వదలి దాని మీద కూర్చొని, చేతుల్తో ముందుకు నెట్టుకుంటూ శివం ఉన్న చోటుకు చేరారు. శివం ట్యూబ్ పట్టుకొని, నీళ్ళల్లో మునిగి తేల్తున్నాడు. సత్యం, శివం తల పట్టుకున్నాడు. రెండు కాళ్ళు పట్టుకున్నాడు సుందరం. కొయ్య చెక్క మీద పడుకోపెట్టి ప్రమాదం నుంచి తప్పించి ఒడ్డుకు చేర్చారు. శివం బాగా నీళ్ళు తాగి ఉన్నాడు. పొట్టమీద చెయ్యి వేసి, టీచర్ గట్టిగా నొక్కాడు. రెండుసార్లుగా నోటిగుండా, తాగిన మొత్తం నీరు బైటకొచ్చేశాయి. కళ్ళు తెరిచాడు శివం! ఎదురుగా అంతా కన్పిస్తున్నారు. మెల్లిగా తల తిప్పి టీచర్ వైపు చూచాడు. "శివం. నీవు మృత్యుంజయుడివి. ప్రాణాపాయం నుండి బైటపడ్డావ్! నీ తోటి స్టూడెంట్స్ సత్యం, సుందరం ప్రాణాలకు తెగించి నిన్ను కాపాడారు!" అంటూ



గుజరాత్‌లో 'ఆనంద్' అనే చోట పాల ఉత్పత్తి కేంద్రము గలదు

వాళ్ళ వైపు చూచాడు టీచర్. సత్యం, శివం, యిద్దరు మిత్రులూ శివం వైపే చూస్తున్నారు. శివం రెండు చేతులూ చాచాడు. సత్యం, సుందరం. చేతులతో తన చేతులు కలిఫాడు శివం. ముగ్గురు మిత్రులూ ఒకటైనారు!

38

పాఠశాల యానివర్సరీ సందర్భంలో ఓపెన్ ఎయిర్ థియేటర్ రంగు రంగుల విద్యుద్దీపాలతో కళ కళలాడుతోంది. రాత్రికి 'విచిత్ర రత్న సింహాసనం' అనునాటకం ప్రదర్శింపబడుతుంది. ప్రదర్శనకు ముందుగా, సన్మాన సభను ఏర్పాటు చేశారు శివం తండ్రి అమృతరావు. ప్రగడ కోటయ్య మెమోరియల్ హైస్కూల్‌నకు డొనేషన్ యిచ్చిన దాతలలో అమృతరావు ముఖ్యుడు. తన కొడుకు శివంను సముద్రంలో ప్రాణాలకు తెగించి కాపాడిన సత్యం, సుందరంలను ఘనంగా సన్మానించబోతున్నారు. రాత్రి 8.30 ని॥లకు సన్మాన సభ ప్రారంభమైంది. థియేటరు ప్రేక్షకులతో కిటకిటలాడిపోతుంది. ఆనాటి సంఘటనను కళ్లకు కట్టినట్టు చెప్పిన హెడ్మాష్టరు సత్యం, సుందరంలను వేదిక మీదకు పిల్చారు. సభాధ్యక్షుడైన అమృతరావు వారిద్దరికీ చెరొక 10 వేల రూపాయలు, నగదు బహుమతి, మరియు సన్మాన పత్రాలు అందజేశాడు. శివం పూల మాలలతో సత్యం, సుందరంలను సత్కరించాడు. థియేటర్ అంతా చప్పట్లతో మార్మోగిపోయింది. ఆనాటి నుండీ వారు ముగ్గురు మిత్రులుగా కలిసిపోయున్నారు!





# తొలి గురువు

కలెక్టరుగా ఉన్న ప్రియాంక తన తల్లిని తన వద్దకు తీసుకురాదలచి స్వంత గ్రామం అయిన 'డక్కిలి'కి వచ్చింది. కలెక్టరు అయినప్పటి తరువాత మొదటిసారిగా ఆ గ్రామానికి రావడంతో అక్కడి ప్రముఖులు ప్రియాంకకి సన్మానసభ ఏర్పాటు చేసారు.

ఆ సన్మాన సభలో సన్మానంతో పాటు పొగడ్తల వర్షం కురిపించారు. రాజకీయ నాయకులు. అందరి ప్రసంగాలు పూర్తి అయిన తరువాత చివరగా మాట్లాడడానికి మైకు వద్దకు వచ్చింది ప్రియాంక.

"ఒక చిన్న గ్రామంలో పుట్టి ఈ రోజు ఒక గొప్ప కలెక్టరు అవ్వడానికి కారణం నా చిన్ననాటి గురువులే," అనడంతో ముందు వరసలోని ఆ గ్రామ టీచర్లు మీసాలు తిప్పారు గర్వంగా.

"ఈ రోజు ఈ ఉద్యోగం ఈ గౌరవం దక్కడానికి వెనుక నా మొదటి గురువు శ్రమ ఎంతో ఉంది. అలాంటి గురువుకి - ఈ సభలోనే సన్మానం చేసి నా ఈ జన్మను ధన్యం చేసుకుంటాను" అనడంతో అక్కడి టీచర్లలో ఎవరు మొదటి గురువు! అన్న ప్రశ్న అందరి మనసులో మెదలడంతో పాటు ఆ అదృష్టం కోసం. అందరూ ఆశపడ్డారు.

నాకు మాటలు నేర్పి, సక్రమైన నడవడిక నేర్పి, అడుగడుగునా నా వెంటనే ఉండి తప్పు ఒప్పులను తెలుపుతూ నాకు ఇంత పెద్ద హోదా కల్పించిన నా తొలి గురువు నాకు జన్మనిచ్చిన తల్లి 'విజయలక్ష్మి' గారు" అనడంతో సభ చప్పట్లతో మారు మోగింది. 'మొదటి గురువు' ఎవరో తెలియడంతో టీచర్లు గూడా చప్పట్లు కొట్టారు. అప్పుడు ఎదుటి వరుసలో కూర్చున్న పాత, క్రొత్త టీచర్లందరికీ ప్రియాంక మాటలతో మరొకసారి వారు చదువుకున్నట్లయింది. ఇదే విషయాన్ని వారి విద్యార్థులకు గూడా బోధించసాగారు.

వేదికపై కూతురు చేతులుతో సన్మానం అందుకున్న విజయలక్ష్మి ఆనందంతో కల్లు చెమ్మగిల్లాయి.


మల్లవరపు భూషన్‌రెడ్డి - గూడూరు



# దేవుడు

"అసలు దేవుడున్నాడంటావా రామరాజు?" సందేహంగా ప్రశ్నించాడు సోమరాజు.

"అదేం మాట సోమరాజు! దేవుడే లేకపోతే.... సూర్యుడు ఎందుకు వెలుగునిస్తాడు? గాలి ఎందుకు వీస్తుంది? గ్రహాలన్నీ వాటి స్థానాల్లోనే అవి ఎందుకు తిరుగుతాయి? భూమి మీద మనం వేసే విత్తనాలను పంటగా ఎలా మారుస్తుంది?" అంటూ వివరణిచ్చాడు రామరాజు.

సోమరాజు, రామరాజులిద్దరు చిన్నప్పటి నుండి స్నేహితులు. పదవ తరగతి వరకు కలిసి చదువుకున్నారు. పై చదువులు చదివే స్థోమత లేక తల్లిదండ్రుల నుండి సంక్రమించిన భూమిని వ్యవసాయం చేసుకొని జీవిస్తున్నారు.

"లేదు. దేవుడు లేడు రామరాజు! ఉంటే లంచం, అవినీతి, స్వార్థం, హత్యలు, అత్యాచారములు, యుద్ధాలు, ప్రపంచమంతా ప్రళయం తాండవం చేస్తోంది! ఇటువంటి పరిస్థితుల్లో నిజంగా దేవుడే వుంటె ఎందుకు చూస్తూ ఊరుకుంటాడు! దుర్మార్గులను శిక్షించవచ్చుగదా!" అన్నాడు సోమరాజు.

"అంత మాత్రానికే వీటన్నింటికి కారణం దేవుడేనంటావా సోమరాజు?" ప్రశ్నించాడు రామరాజు.

"అనను. ఎందుకంటే దేవుడు ఉంటే కదా! దేవుడే వుంటే దుర్మార్గులను, స్వార్థపరులను, నీచుల్ని పుట్టించి, మంచి వాళ్ళకు ఎందుకు కష్టాలు కలిగిస్తాడు." దేవుడు లేడని నిర్ధారించాడు సోమరాజు.

"నీ ఆలోచన తప్పు సోమరాజు! నీకు ఒక ఉదాహరణ చెబుతాను విను. మనం పంట వేసే ముందు పొలాన్ని శుభ్రం చేసి, దుక్కిదున్ని, శుద్ధి చేసిన విత్తనాలను చల్లుతున్నాముగదా? అయినా పంటతో పాటు కలుపు మొక్కలు కూడా వస్తున్నాయిగదా! అంత మాత్రాన మనము కలుపు విత్తనాలు చల్లినట్లా? ఏ రైతూ తన పొలంలో కలుపు విత్తనాలు చల్లుకోడు. అలాగే దేవుడు కూడా ప్రపంచమనే తన పొలంలో అన్నీ మంచి విత్తనాలే చల్లుతాడు. కాని వాటితో పాటు దుర్మార్గులు, నీచులు, స్వార్థ పరులనే కలుపు మొక్కలు కూడా పెరుగుతాయి. అంత మాత్రాన దేవుడిది తప్పని, దేవుడే లేడని అంటే ఎలా? కలుపు మొక్కలు ఎక్కువైనపుడు వాటిని నివారించి పంటను రక్షించుకోవాలి రైతు. ప్రపంచంలో పాపం పెరిగిపోయినపుడు యుద్ధం, వరదలు, భూకంపాలు మొదలైన ప్రళయాలు కల్పించి కలుపు మొక్కలను తొలిగించి, మంచి మనుషులను కాపాడుకుంటాడు దేవుడు!" అంటూ రామరాజు వివరించాడు.

రామరాజు మాటలకు సోమరాజుకు జ్ఞానోదయం అయింది. ప్రతిదానికీ దేవుడిని నిందించకుండా నమ్మకం కల్పించుకున్నాడు. ❋

కోగటం వీరాంజనేయులు - కడప





# దెయ్యాల బీడు!



నాగన్నకు చిన్నతనంలోనే తల్లీ, తండ్రి పోయారు. వాడు ఇరవై ఏళ్ళ వయసు వాడయే వరకూ గ్రామంలోని మోతుబరి రైతుల ఇళ్ళల్లో పాలేరుగా పనిచేస్తూ పొట్ట నింపుకునేవాడు. వాడు సహజంగా మంచి తెలివైన వాడు కావడంతో, వ్యవసాయపు పనుల్లో నేర్పరి అని మంచి పేరు సంపాదించాడు. నాగన్న పెళ్ళి చేసుకుని ఒక ఇంటివాడు కావాలనుకున్నాడు. కాని, వాడికి పిల్లనిచ్చేందుకు ఎవరూ యిష్టపడలేదు. "నువ్వు చూడబోతే పాలేరువి. నీ యజమాని ఇంటి పనుల్లో రాత్రింబళ్ళు ఒళ్ళు హూనం చేసుకుంటావు. నీకు పిల్లనిస్తే, మా పిల్ల ఆలనా పాలనా అయినా చూసేందుకు నీకు తీరుబాటుంటుందా! నువ్వు పాలేరు పని మానేసి, ఎవరి పొలమైనా కౌలుకు తీసుకుని చేసుకునేట్టయితే, మా పిల్లనిస్తాం!" అన్నారు ఒకరిద్దరు. వాడు తనకు తెలిసిన పెద్ద రైతుల నుంచి పొలం కౌలుకు తీసుకునే ప్రయత్నం చేశాడు కానీ సాధ్య పడలేదు. దానితో వాడికి తన గ్రామం మీదా, తన బ్రతుకు తీరు మీద ఏవగింపు కలిగింది.

నాగన్న ఒకనాటి ఉదయం గ్రామం వదిలి మూడు రోజుల పాటు అడవి దారిన ప్రయాణం చేసి, నాలుగో నాటి ఉదయానికి మరొక గ్రామం చేరాడు. ఆ గ్రామానికి నాలుగు పక్కలా పచ్చటి పంట పొలాలున్నవి. అయితే, నాగన్న గ్రామంలోకి పోతున్న దారి పక్కన, పంట పొలాల మధ్యలో ఒక పెద్ద బీడూ, పాడుబడిన బావి వాడి కంట బడినై. నాగన్న ఆశగా ఆ బీడు పొలం కేసి చూస్తూ, ఇది నాకు కౌలుకిస్తే బంగారం పండించగలను అనుకుని, దారే పోతున్న ఒక మనిషిని ఆపి, ఆ బీడు ఎవరిదని అడిగాడు. అతను గ్రామంలో ఎత్తుగా ఉన్న ఒక మేడ కేసి చేయి చూపి, "అందులో వుండే జమీందారు గారిది" అని తన దారిన తానుపోయాడు.

పోడూరి శ్రీబదరీనారాయణ - విజయవాడ



మనదేశంలో వున్న ఏకైక తెల్ల మొసలి 'గౌరి' భితర్ కానిక నేషల్ పార్క్‌లో వున్నది



నాగన్న జమీందారు దగ్గరకు పోయి, తన గురించి చెప్పుకుని, "అయ్యా, మీరు సాగు చెయ్యకుండా వదిలి పెట్టిన బీడును, నాకు కౌలుకిచ్చారంటే మీ పేరు చెప్పుకుని సుఖంగా బతికిపోతాను," అన్నాడు. జమీందారు నవ్వి "అది దెయ్యాల బీడయ్యా! దాని సంగతి, ఈ చుట్టు పక్కల అన్ని గ్రామాల వాళ్ళకూ తెలుసు. అందులో భయంకరమైన దెయ్యాలు చాలా వున్నాయి. బీడును సాగులోకి తేగల వాళ్ళకు సగం బీడు ఉచితంగా ఇస్తానని చాటింపు కూడా వేయించాను. ధైర్యవంతులమనుకుని రాత్రి వేళ అక్కడికి వెళ్ళిన వాళ్ళు, ప్రాణాలతో ఒక్కరూ తిరిగి రాలేదు. కనుక ఆ బీడు జోలికి పోకు!" అన్నాడు.

నాగన్నకు దెయ్యాలంటే భయం లేదు. బీట్లో నుంచి దెయ్యాలను తరిమేయగలిగితే, సగం బీడు తనదవుతుందన్న ఆశతో నాగన్నకు ఎక్కలేని తెగింపు వచ్చింది. నాకొక అవకాశం యివ్వండని అడిగిన నాగన్న జమీందారింట్లోనే భోజనం చేసి, చీకటి పడగానే తన చేతి కర్ర తీసుకుని, బీట్లోకి పోయి, ఒక పెద్ద చెట్టును అనుకుని కూర్చున్నాడు. ఒక జాము రాత్రి గడిచేసరికి, నాగన్న ముందు భయంకరమైన రెండు దెయ్యాలు ప్రత్యక్షమయ్యాయి. వాడు చేతి కర్రను గట్టిగా గుప్పెట బిగించి పట్టుకుని, ఏమాత్రం తొణక్కుండా వాటి పుర్రెల్లోకి పరీక్షగా చూశాడు. దెయ్యాలు రెండు ఒకడుగు వెనక్కు వేసి "ఆహా! ఏం నీ ధైర్యం! లోగడ ఇక్కడికి వచ్చిన వాళ్ళు, మమ్మల్ని చూస్తూనే గుడ్లుతేలేసి పారిపోయేవారు. ఇంతకీ ఎవరు నువ్వు?" అని అడిగినై. "నేనెవరైతే ఏం గానీ, మీకేం పని లేదా? మీ జంట దెయ్యాలు ఈ అర్ధరాత్రి వేళలో ఇక్కడి కెందుకొచ్చారు! మీకేం కావాలి?" అన్నాడు నాగన్న. "వీడు మన తగువు తీర్చగల సమర్థుడులా వున్నాడు!" అన్నదొక దెయ్యం. అవున న్నట్టు రెండో దెయ్యం తలాడించింది. "ఈ పాడు బడ్డ బీడుకు, మా ఇద్దర్లో ఎవళ్ళో ఒకళ్ళం, అన్ని హక్కు భుక్తాల్తో యజమానులం కాదలుచుకున్నాం. ఈనాటి వరకూ మేం చేసిన ఘనకార్యాల సంగతి విని, మాలో ఎవరు గొప్పో నువ్వు న్యాయంగా తీర్పివ్వాలి. అలా చెయ్యకపోయావో, నువ్వు తెల్లవారి వెళ్ళేది గ్రామంలోకి కాదు, ఆ పాడు బడ్డ దిగుడు బావిలోకి త్రోసేస్తాం తెల్సిందా!" అన్నవి దెయ్యాలు.

"అలాగే న్యాయంగా తీర్పిస్తాను. నాక్కావలసింది మీ శక్తి సామర్థ్యాలను గురించిన ప్రత్యక్ష సాక్ష్యం గతంలో చేసిన ఘనకార్యాల గొప్పలు కాదు," అన్నాడు నాగన్న. "సరే, ఇప్పుడు మమ్మల్ని ఏం చేయమంటావో చెప్పు!" అన్నవి దెయ్యాలు.

నాగన్న తన చేతి కర్రతో ఒక దెయ్యం భుజం మీద చిన్నగా కొట్టి, "నువ్వు, ఈ బీడు మధ్య

ఒక చక్కటి అందమైన ఇల్లు కట్టాలి. ఆ పని, ఈ అర్ధరాత్రిలోగా పూర్తి కావాలి" అన్నాడు.

"ఓ అదెంత పని!" అంటూ దెయ్యం వెళ్ళి పోయింది. నాగన్న రెండో దెయ్యం నడుం మీద తన చేతి కర్రతో చిన్నగా పొడిచి, "నీతోటి దెయ్యం ఇల్లు కట్టడం పూర్తి చెయ్యగానే, నువ్వు దాని చుట్టూ ప్రహరీ ఏర్పాటు చేసి, లోపల కూరల పాదులూ, పూల చెట్లూ నాటాలి ఈ పని, తొలి కోడి కూసే లోపల పూర్తికావాలి" అన్నాడు. "అదొక లెక్కా, నాకు!" అంటూ రెండో దెయ్యం వెళ్ళిపోయింది. సరిగా అర్ధరాత్రి సమయంలో మొదటి దెయ్యం నాగన్న దగ్గరకు వచ్చి, "ఇంటి పని పూర్తయి పోయింది. నేను గొప్పదాన్నని తీర్పు ఇస్తావుగదా?" అంది. నాగన్న ఒక క్షణం ఆగి, "అలాగే ఇవ్వాలి మరి! కాని, అలా తీర్పిస్తే, ఆ రెండో దెయ్యం నన్ను బతకనిస్తుందా?" అన్నాడు. ఆ భయాలేం పెట్టుకోకు. నా వెంటరా! దాన్ని హతం చేసే మార్గం చెబుతాను," అంటూ దెయ్యం నాగన్నను బీడు చివరికి తీసుకుపోయి, ఒక్క మొక్క చూపించి, "దీని వేరు చేతికి కట్టుకొని దీని కాండాన్ని ధూపంగా వేశావంటే అది చావడమో లేక కొన్ని ఆమడల దూరం పారి పోవడమో చేస్తుంది" అన్నది. "సరే, రేపు రాత్రికి రా. తీర్పు నీ పక్షానే ఉంటుంది. ఆ రెండో దాన్ని రేపు రాత్రికి రమ్మంటాను," అన్నాడు నాగన్న.

తొలి కోడి కూసే వేళకి రెండో దెయ్యం పని పూర్తి చేసానంటూ ఉత్సాహంగా నాగన్న దగ్గరకు వచ్చింది. నాగన్న దాన్ని మెచ్చుకుని, తీర్పు దాని పక్షానే వుంటుందని చెప్పి, మొదటి దెయ్యం తనకేమన్నా హాని చేస్తుందేమో అనగా ఆ దెయ్యం అతణ్ణి భయపడవద్దని, బీడులో మరొక చివరకు తీసుకుపోయి, అక్కడ నేల మీద పాకు తున్న ఒక తీగను చూపించి "దీని వేరును మెడకు కట్టుకో. ఆ దెయ్యం నీ దగ్గరకు రాగానే, దీని





ఆకుల్ని నిప్పులో వెయ్యి. ఆ పొగకు అది చావడమో, కారడవులు పట్టి పోవడమో చేస్తుంది" అన్నది. నాగన్న మొక్క వేరు ఆకులు తీసుకుని, దుస్తుల్లో దాచుకుని, మొదటి దెయ్యానికి చెప్పినట్టే, రెండవ దాన్ని మర్నాటి రాత్రికి రమ్మన్నాడు.

తరువాత జమీందారు దగ్గరకు పోయి, జరిగిందంతా చెప్పాడు. నాగన్న దెయ్యాల బీడు లోంచి ప్రాణాలతో తిరిగి రావడమే జమీందారుకు ఆశ్చర్యాన్ని, ఆనందాన్నీ కలిగించింది. నాగన్న దెయ్యాలు చెప్పిన వేరులు ముంజేతికి కట్టుకుని, చీకటి పడగానే ఒక కుంపటి తీసుకుని దెయ్యాల బీడులోకి వెళ్ళి, చలికాగుతూ కూర్చున్నాడు. జాముర్రాత్రి గడిచే సరికి దెయ్యాలు రెండూ, ఏమిటినీ తీర్పు అంటూ నాగన్న దగ్గరకు వచ్చినై. వాడు దెయ్యాలను మరి కాస్త దగ్గరకు రమ్మని, "పగలల్లా న్యాయ శాస్త్ర గ్రంథాలు చదువుతూ కూర్చున్నాను. ఈ బీడు ఇక్కడ వున్న మన ముగ్గురిలో శక్తి వంతులైన వాళ్లదని తెలుసుకున్నాను. నేనే శక్తిమంతుణ్ణి!" అంటూ దెయ్యాలు చెప్పిన చెట్టు కాండాల్నీ, ఆకులనూ కుంపటి నిప్పుల్లో వేశాడు. ఆ వెంటనే గుప్పుమంటూ పెద్ద పొగ లేచింది. దెయ్యాలు రెండూ కీచుకీచుమంటూ అదృశ్యమయిపోయాయి! జమీందారు నాగన్న ధైర్యాన్ని మెచ్చుకుని వాడికి బీడులో సగం దానంగా ఇచ్చి తన కూతుర్ని గూడా యిచ్చి పెళ్ళి చేసాడు. అంతట నాగన్న ఒక యింటి వాడై వ్యవసాయం చేసుకుంటూ సుఖంగా జీవనాన్ని కొనసాగించాడు!

## కష్టంలో కాంతిరేఖ

- డి.కె. చదువుల బాబు - ప్రొద్దుటూరు

లండన్ నగరంలోని ఒక పేటలో పిల్లలు ఆటలలో మునిగి ఉన్నారు. ఆ ఆటల మైకంలో పెద్ద పిల్లవాడు తనకంటే చిన్నవాడయిన ఒక బాలుణ్ణి చేతుల్లోకి తీసుకొని పైకి విసిరాడు. వాడు క్రిందకు రాగానే తాను పట్టుకోగలనని అనుకొన్నాడు. కాని అలా చేయలేక పోయాడు! తత్ఫలితంగా ఆ బాలుడు ధడేలుమని క్రిందకు వచ్చి పడ్డాడు. అతని కాలు, నడుము ఎముకలు నలిగిపోయాయి.

ఆ బాలునికి ఇది ఒక తీరని విషాద ఘటన అయింది. లేవలేకపోవడం వలన అతను నిరంతరం మంచం మీదనే పడి యుండవలసి వచ్చింది. అతను ఏదీ చేయలేడు. ఎందుకూ పనికిరాడు. కాలక్షేపం కొరకు మంచి మంచి పుస్తకాలు చదవాలనే ఆసక్తి ఏర్పడింది అతనికి. చదువుతున్న కొద్దీ వాటిపై అభిరుచి పెరిగింది. సాహిత్యం పట్లగూడా అభిరుచి పెరిగింది. నేను కూడా సాహిత్య సృష్టి ఎందుకు చేయకూడదు? అని అతని మనస్సుకు అనిపించింది. ఈ అంతఃప్రేరణ కారణంగా అతడు కలం చేత పట్టాడు. తన భావాలకు రూపకల్పన చేయసాగాడు. తన కష్టాన్ని ఆ సరాగా తీసుకొని కదలలేని స్థితిలో సమయాన్ని సద్వినియోగం చేసుకున్న ఆ బాలుడే తరువాత కాలంలో ఆంగ్ల సాహిత్యంలో ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన హెచ్.జి.వాల్స్‌గా రూపొందాడు!





# సర్వం శ్రీరామమయం!

శ్రీరామచంద్రుడు సుమేరు పర్వతముపై సీతా పరివారసమేతంగా విడిసెను. లక్ష్మణమూర్తి మెత్తనిశయ్యను శ్రీరామునికి ఏర్పాటు చేశాడు. అంతలో చంద్రోదయమయింది. ఉదయించుచున్న చంద్రుని చూచి శ్రీరామచంద్రుడు "ఆ చంద్రునిలో మచ్చ వున్నది కదా! ఆ మచ్చ ఏమిటో చెప్పగలరా? మీరు ఎవరికి తోచిన విధంగా వారు దాన్ని వర్ణించండి" అన్నాడు. సేనా నాయకుడు సుగ్రీవుడు "రఘుకుల తిలకమా! చంద్రుని పై భూదేవి ఛాయ పడుతున్నది. అదే ఆ నల్లని రంగు" అన్నాడు. ఇంకొకరు "రాహువు చంద్రుని మ్రింగబోయినప్పుడు తగిలిన గాయం ఆ మచ్చ" అన్నారు. మరి ఒకరు "బ్రహ్మదేవుడు రతీ దేవిని సృష్టించునప్పుడు ఆమెను లోకోత్తర సుందరిగా చేయనెంచి చంద్రునిలోని సారమంతయు తీసినాడు. దానివల్ల రతీ దేవి ముఖము పరమ సుందర ముగా రూపొందినది. కాని చంద్రుని హృదయము ఛిద్రమయ్యెను. భగ్న హృదయమే ఆ విధంగా కనపడుచున్నది" అన్నారు. "హనుమా! నీవేమని అందువు?" ఆంజనేయస్వామి చేతులు జోడించి "స్వామీ! రఘుకుల సోముడవైన నీ శ్యామ సుందర రూపమే ఆ చంద్రుని మధ్యలో నిలిచియున్నట్లు నాకు గోచరించు చున్నది!" అన్నాడు. ఆంజనేయునికి తన హృదయం ఎలా రామమయం అయిందో సర్వమూ శ్రీరామ మయంగానే కనపడుతుంది. అతని భక్తికు సాటిలేదు. ❋

వి. మంజురాణి - హైద్రాబాద్



# పశ్చాత్తాపం!

శ్రీపురం గ్రామంలో సత్యారావు, సూర్యారావు అనే ఇద్దరు ప్రాణ స్నేహితులు ఉండేవారు. వారిరువురు చిన్నప్పటి నుండి ఒకే స్కూల్‌లో చదువుకుని ఒకే కంపెనీలో ఉద్యోగాలు సంపాదించి, పెళ్లిళ్లు అయ్యి, పిల్లలు కూడా పుట్టేక ఒకే చోట ప్రక్క ప్రక్క ఇళ్ళల్లో అద్దెకుదిగి, జీవనం సంతోషంగా సాగిస్తున్నారు.

ఒకరోజు సూర్యారావు, తన మిత్రుడు సత్యారావుని పిలిచి "ఒరేయ్ మీ అబ్బాయి రాము పద్ధతి రోజు రోజుకి శృతిమించి పోతుంది. వీధిలో ఆకతాయి కుర్రాళ్ళతో చేరి బాగా అల్లరిచేస్తున్నాడు. మనం కష్టపడి సంపాదించి ఎన్ని చదువులు చదివించినా, పిల్లలకు వినయవిధేయతలు, చక్కని క్రమశిక్షణ చాలా అవసరం. కాస్త భయం చెప్పు." అంటూ చెప్పి వెళ్ళిపోయాడు. సూర్యారావు.

ఆ రోజు సాయంత్రం ఆఫీసు నుండి వచ్చాక, రాము స్కూల్ నుండి ఎప్పుడు వస్తాడా? అని ఎదురు చూడసాగాడు సత్యారావు. స్కూల్ విడిచి పెట్టే సమయం దాటి రెండుగంటలైనా ఇంకా ఇంటికి రాలేదు రాము. అలాగే ఓపిగ్గా ఎదురు చూస్తుండగా, కొంత సేపటికి రాము స్కూల్ నుండి ఇంటికి వచ్చాడు. సత్యారావు మిక్కిలి కోపంతో "ఏరా! ఈమధ్య వీధిలో కుర్రాళ్ళతో చేరి చాలా అల్లరి చేస్తున్నావట. నిన్ను శ్రద్ధగా చదువుకోమని పంపుతుంటే ఈ అల్లరేమిటి? ఇంకెప్పుడైనా ఇలా అల్లరి చేస్తున్నట్లు నా దృష్టికి వచ్చిందో తాట వలిచేస్తా! అని గట్టిగా మందలించాడు.

రాముకు చాలా కోపం వచ్చింది. ఇది సూర్యారావు అంకుల్ పనై ఉంటుంది. స్నేహితులతో కలసి ఆడుతుంటే ఎక్కువ సూర్యారావు అంకులే చూసే వాడు, అని గ్రహించి, ఎలాగైనా సూర్యా

*గుండాబత్తుల శ్రీనివాస్ - గొల్లలమామిడాడ*

రావు అంకుల్ పై పగ తీర్చుకోవాలనే దుర్బుద్ధి పుట్టింది. ఓ రోజు రామునాన్న, సూర్యారావు కలసి వస్తుండగా గోడ చాటు నుండి సూర్యారావుకు తగిలేలా ఓరాయి విసిరాడురాము. కాని అది గురి తప్పి సత్యారావుకు తగిలి గాయమైంది. చాలా రక్తం పోవడంతో హాస్పటల్‌కు తీసుకెళ్ళాడు సూర్యారావు.

డాక్టరుగారి వైద్యం నిమిత్తం డబ్బులు ఎక్కువగానే ఖర్చయ్యాయి. ఆ సమయానికి సత్యారావు వద్ద డబ్బుల్లేవు ఖర్చంతా సూర్యారావే భరించాడు. అంతేకాకుండా మరునాడు ఆఫీసుకు శెలవు పెట్టి తన మిత్రుడు వద్దే ఉండి, సేవలందించాడు.

ఇదంతా చూసిన రాముకు కనువిప్పు కల్గింది. సూర్యారావు అంకుల్ అంటే కష్టసుఖాల్లో పాలు పంచుకుని తన తండ్రి యోగ క్షేమాలు కోరే అసలు సిసలైన ప్రాణస్నేహితుడని, తను క్షణికావేశంలో లేనిపోని అపోహతో చేసిన చెడు పని వలన తన తండ్రికి గాయమై. బాధపడవల్సి వచ్చినందుకు సిగ్గుతో తనలో తానే కుమిలిపోయాడు. తన తప్పును ఒప్పుకుని, ఇలాంటి తప్పులెప్పుడు చేయనని సూర్యారావు అంకుల్‌ని వేడుకున్నాడు. ఆనాటి నుండి రాము బుద్ధిగా ఉంటూ.. స్కూల్‌కు చక్కగా వెళ్తూ మంచి మార్కులు తెచ్చుకుని అందరితో"రాముడు మంచి బాలుడు"అనిపించుకున్నాడు. తన మిత్రుడు ముందు చూపు వల్లనే తన కొడుకులో సరైన మార్పు వచ్చినందుకు. సత్యారావు ఎంతో ఆనందించి పై చదువులు చదివించి కొడుకుని ప్రయోజకుడిని చేశాడు. ✫





## కష్టాలే కావాలా?

ప్రతి రోజూ లేచిన వెంటనే దేవుని తలచుకొని లేవటం తాతయ్యకు అలవాటు. ఒకరోజున ఆ దృశ్యాన్ని మనుమడు చూశాడు. తాతయ్య ప్రార్థన విని ఆశ్చర్యపోయాడు.

"ఈ రోజు కూడా నాకు కష్టాలే కలిగేట్లు చూడు దేవుడా!" అని ప్రార్థించడం విని, "ఏంటి తాతా! అలా ప్రార్థిస్తున్నావు? ఎవరైనా ప్రార్థించేముందు తనకు అన్నీ మంచే జరగాలని కోరుకుంటారు గదా! మరి నీవేంటి?" అని ప్రశ్నించాడు మనుమడు.

నిజమే నాయనా! "నా కోరిక తప్పు కాదు" అన్నాడు తాత.

"నీవు ప్రతిరోజు కష్టాలే కావాలని ప్రార్థించడానికి గల కారణమేమిటి?" అని ప్రశ్నించాడు రాజు. "కారణం ఉంది. చెబుతాను విను" అంటూ చెప్పడం ప్రారంభించాడు.

"భారతంలోని పాండవులకు అన్ని కష్టాలు తీరిపోయాయి. వారంతా సుఖాలు అనుభవిస్తున్నారు. అప్పుడు శ్రీ కృష్ణ భగవానుడు కుంతీ దేవి వద్దకు వచ్చి. అత్తా! నాకు సెలవు యిప్పించు వెళ్ళి వస్తా"నన్నాడు.

"నీవు వెళ్ళిపోవడం ఏమిటి?" అంది కుంతీ. "ఇప్పుడు మీరంతా సుఖంగానే వున్నారు గదా! ఇక నా అవసరం ఏముంటుంది మీకు!" అన్నాడు.

"అయితే మా సుఖాలు నీవు చూడలేవా?" అంది.

అవునన్నాడు కృష్ణుడు.

"నీవు లేని సుఖాలు మాకొద్దు, మాకు అన్నీ కష్టాలే కావాలి. నువ్వు మా చెంత ఎప్పుడూ వుండాలి!కష్టాలున్న చోట భగవంతుడవైన నీవు రక్షించటానికి వుంటావుగదా!" అని ప్రాధేయపడింది కుంతి.

"అందుకే కష్టాలు కోరుకోవటం సుఖాలకన్నా కష్టాల్లోనే దేవుణ్ణి ఎక్కువ సార్లు తలుస్తాం. సుఖం అజ్ఞానాన్ని యిస్తుంది. కష్టం ప్రజ్ఞానాన్ని కలగజేస్తుంది. సుఖాలనుభవించేప్పుడు తోటి మానవుడే గుర్తుకు రానపుడు దేవుడేం గుర్తొస్తాడు అదే కష్టాలను భవిస్తుంటే భగవన్నామం వీడం గదా!" అని చెప్పాడు తాత.

తాత వేదాంతం రాజుకు కొంత వరకు అర్థమైయింది. కానీ రాజు మాత్రం తాతలాగా ప్రార్థించటం లేదు. చిన్న వయస్సు గదా! ఇటువంటి కథలు యింకా ఎన్నో వింటేగాని రాజుకి అనుభవం రాదు.

వి.వి. సత్యనారాయణ - నాగాయలంక



# వైద్య వృత్తి విలువ

జయంత్ పేరెన్నికగన్న ఫారెన్‌లో చదివొచ్చిన డాక్టర్! లక్షలకు లక్షలు ఖర్చుపెట్టి విదేశాల్లో చదువుకున్నందున 'మోజు'గా అందరూ అతడి దగ్గరకే వెళ్లేవారు. ఆ కారణంగా అందరి కంటె 'కన్సల్టేషన్ ఫీజు' ఎక్కువగా వసూలు చేయసాగాడు. తను డాక్టర్ చదవడానికయిన ఖర్చు తక్కువేమీ కాదుగదా! అంతకు అంతా సంపాదించాలని డబ్బే 'లక్ష్యం'గా పవిత్రమైన వైద్య వృత్తిని వ్యాపారంగా మార్చేశాడు. ఎంతటి పేదవారికైనా, ప్రాణాపాయ స్థితిలో వున్న వారికైనా కోరినంత డబ్బు ఇవ్వనిదే వైద్యం చేసేవాడు కాదు.

'వైద్యో నారాయణో హరిః' అన్నారు పెద్దలు. దేవుడి తర్వాత దేవుడంతటి వాడు వైద్యుడు. ఉచితంగా వైద్యం చేసైనా రోగి ప్రాణాలు నిలపాలి. డబ్బే ప్రధానమనుకుని, రోగిని నిర్లక్ష్యం చేయడం వైద్య వృత్తికే కళంకం అని ఎందరు చెప్పినా జయంత్ పద్ధతి మారలేదు.

జయంత్ మాత్రమే నయం చేయగల రోగాలను నయం చేయించుకుందుకు జయంత్ దగ్గరకొచ్చిన రోగులు ఒకరిద్దరు అతడు అడిగినంత ఇచ్చుకోలేక, వైద్యం అందక, ప్రాణాలు కోల్పోయారు కూడా! ఐనప్పటికీ జయంత్ రవ్వంతైనా చలించలేదు. "అంతగా డబ్బులేని వాళ్ళు నా వద్దకు వైద్యానికి ఎందుకు రావాలి?" అడిగేవాడు.

ఒక నాడు రోడ్డు ప్రమాదంలో గాయపడి ప్రమాదస్థితిలో వున్న ఓ బాలుణ్ణి నలుగురు పెద్ద మనుషులు ఆ దగ్గరలో వున్న జయంత్ దగ్గరకు వైద్యం కోసం తీసుకువచ్చారు.

"డాక్టర్.....! తలకు బలమైన గాయమైంది. రక్తం చాలవరకు పోయింది. వెంటనే వైద్యం చేసి ఆ పసివాడి ప్రాణాలు నిలపండి" అన్నారు ఆదుర్దాపడుతూ....

"ఏక్సిడెంట్ కేసులంటే 'రిస్క్' ఎక్కువ. ఏదన్నా జరగరానిది జరిగితే 'పోలీస్ కేస్' అవుతుంది. ఐనారిస్క్ చేస్తాను. ఓ వేయి రూపాయలు

జొన్నకూటి మార్టిన్ ఫిన్‌లె - విజయవాడ

కౌంటర్లో చెల్లించి రండి" అన్నాడు పేషంట్‌ని చూడకుండానే.

దానికి వచ్చిన వాళ్ళు ఒకరి మొహాలొకరు చూసుకుని "డాక్టర్ గారూ... ఆ పసివాడు ఎవరో మాకూ తెలీదు. రోడ్డు మీద జరిగిన ప్రమాదంలో గాయపడితే మా 'వంతు'గా మేము తీసుకు వచ్చాము. దయతో మీరు 'వైద్యం' చేసి ఆ బాలుని ప్రాణాలు నిలపండి" అన్నారు ప్రాధేయ పడుతూ.

"అదేం కుదరదు. డబ్బిస్తేనే వైద్యం" అన్నాడు జయంత్ నిర్లక్ష్యంగా.

ఆ పిల్లవాడి తల్లిదండ్రులకి కబురు చేద్దామన్నా అడ్రస్ వివరాలు తెలీవు. ఏం చేయాలో పాలుపోలేదు వాళ్ళకి. వాళ్ళల్లో వాళ్ళు రెండు నిముషాలు తర్కించుకుని "అలాగే డాక్టర్.... చూస్తూ... చూస్తూ ఓ నిండు ప్రాణాన్ని బలిపెట్టలేము. ఆబిడ్డ తల్లిదండ్రులకి పుత్రశోకాన్ని మిగల్చలేము. మేము తలొక కాస్త వేసుకుని డబ్బు ఇచ్చుకుంటాము. వైద్యం ప్రారంభించండి" అంటూ తలొక రెండు వందల యాభై వేసుకుని డాక్టర్ చేతికి డబ్బందించారు.

డబ్బు జేబులో వేసుకుని పేషెంట్‌ని ఎమర్జన్సీ విభాగానికి తీసుకురమ్మని కొత్తగా చేరిన నర్స్‌కి పురమాయించాడు. నర్స్ ప్రమాదం జరిగిన పిల్లవాడ్ని స్ట్రెచర్‌లో పడుకోబెట్టి తీసుకు వచ్చింది. స్కూల్ యూనిఫాంలో ఉన్న ఆ పిల్లవాణ్ని చూస్తూనే పెద్దగా అరిచాడు డాక్టర్! షాక్‌తో వణికిపోయాడు. ఆ బిడ్డ మరెవరో కాదు. డాక్టర్ జయంత్ అక్క కొడుకు! వారు పక్క వీధిలో వుంటారు. తలకైన గాయం వల్ల స్పృహ తప్పి వున్నాడు. గాయం నించి రక్తం ధారగా స్రవిస్తోంది. వణుకుతున్న చేతులతోనే గాయం కడిగి కుట్లు వేసి, తర్వాత సెలైన్ బాటిల్ అమర్చాడు. ఫర్వాలేదనుకున్న తర్వాత నర్సుని కనిపెట్టుకుని వుండ





మని చెప్పి తన అక్కకు ఫోన్ చేసి చెప్పాడు. వెంటనే అక్క, బావ ఆదుర్దాగా వచ్చారు.

అప్పటి వరకు అక్కడే వుండి, "కుర్రాడికెలా వుంది? ప్రమాదం లేదుకదా!" అని ఆదుర్ధాగా అడుగుతోన్న ఆ నలుగురు పెద్ద మనుషులకి చేతులెత్తి నమస్కరిస్తూ "అయ్యా! ఆ బిడ్డ మరెవరో కాదు. ఈ చికిత్స చేసి బ్రతికించిన డాక్టర్‌కు అక్కను, ఈ బిడ్డకు తల్లిని. నా బిడ్డను కాపాడిన దేవుళ్ళు మీరు. ఒకవేళ మీరే గనక డబ్బు చెల్లించకపోయినట్టయితే నాతమ్ముడు నిర్లక్ష్యం వలన నా బిడ్డకే ప్రమాదం జరిగిందన్న విషయాన్ని కూడా తెల్సుకోలేక పోయేవాడు. మా బిడ్డను బ్రతికించుకోలేక పోయేవాళ్లం. ఈ బిడ్డ మీకేమీ కాకపోయినా మానవత్వంతో ప్రాణాలు నిలపడం కోసం మీరెంతో తాపత్రయపడ్డారు. సాటి మనిషికి ప్రాణం పోయడానికి మీరంతా 'బాధ్యత' తీసుకోగా, డాక్టర్ వృత్తిలో వున్న నా తమ్ముడు ఇంకెంతో బాధ్యత నెరిగి ప్రవర్తించాలి? అతడి బుద్ధి గడ్డితిని డబ్బే లక్ష్యంగా, రోగిని నిర్లక్ష్యం చేసాడు." అంటూ డాక్టర్ అక్క, బావలు రోదించారు. దాంతో డాక్టర్ జయంత్ "ప్రాణం ఎంత విలువైనదో, దాన్ని కాపాడటం డాక్టర్‌కి ఎంత బాధ్యతో తెలిసి వచ్చింది. ఇకపై ఎన్నడూ, రోగులప్రాణాల్ని డబ్బుతో ముడి పెట్టను" అంటూ వాళ్ళు యిచ్చిన డబ్బు తిరిగి వాళ్ళకు ఇచ్చేశాడు. ఆ తర్వాత జయంత్ రోగుల నుంచి డబ్బు వసూలు చేసే విషయంలో ఉదారంగా వ్యవహరిస్తూ మంచి పేరు తెచ్చుకున్నాడు.

# బుష్-లాడెన్ మాస్కులకు గిరాకీ!



న్యూయార్క్‌లోని వరల్డ్ ట్రేడ్ జంట భవనాలపై బిన్ లాడెన్ ఆత్మాహుతి దళాలతో దాడులు చేయించి అతి విలువైన 110 అంతస్థులు గల భవనాలను నిముషాల్లో కూల్చి వేయించాడు. దానికి ప్రతీకార చర్యగా అఫ్ఘనిస్థాన్ స్థావరంగా చేసుకుని యున్న బిన్‌లాడెన్‌ను సంహరించాలనే ధ్యేయంతో అమెరికా అధిపతి బుష్ అఫ్ఘనిస్థాన్ అంతటా అతలాకుతల మయేలా విమాన దాడులతో బాంబుల వర్షం కురిపిస్తున్నాడు. ప్రపంచ దేశ పౌరులందరికీ ప్రస్తుతం అమెరికా ప్రెసిడెంట్ బుష్, అంతర్జాతీయ ఉగ్రవాది బిన్‌లాడెన్‌ల, ఫోటోలు, టీవీ వార్తల్లో, పేపర్లలో హాట్‌హాట్ వార్తలు వినిపిస్తున్నాయి, మొహాలు కనిపిస్తున్నాయి. ఈ ప్రముఖులిద్దరినీ వ్యాపార పరంగా వాడుకుని లాభా లార్జించాలనుకున్న కొందరు సీజనల్ వ్యాపారస్థులు అమెరికాలోనూ, ఐరోపాలోనూ ఎక్స్‌ప్రెస్ స్పీడ్‌లో వీరియిద్దరు మాస్కులను తయారుచేసి అన్ని సిటీల్లో షాపుల్లోనూ, రోడ్ల కూడళ్లలోనూ అమ్ముకోవటం ప్రారంభించారు. ఈ రెండు మాస్కులనూ అమ్ముకుంటూ నగరాల్లో వేలాది మంది జీవిస్తున్నారు.



ఈ మాస్కులు కొనుక్కుని యింటికి తీసుకువెళ్లినవారు తమ పిల్లలకు, కుటుంబ సభ్యుల మొహాలకు తగిలించి యుద్ధాల ఆటలు ఆడుకుంటున్నారు! మరికొందరు యుద్ధం వద్దని బుష్ మాస్క్ తగిలించుకుని ప్రదర్శనల్లో పాల్గొంటున్నారు. ఇంకొందరు లాడెన్ మాస్క్ తగిలించుకుని ఈయనే మా ఆరాధ్య దైవం అంటున్నారు తీవ్రవాదులు. టోటల్‌గా ఈ మాస్కులకు అన్ని నగరాల్లోను గిరాకీ బాగా ఏర్పడింది. ఇస్లామిక్ దేశాలవారు గూడా వీరియిరువురి మాస్కులను తయారు చేయించి వారూ అమ్ముకుంటున్నారు. ఎవరికిష్టమైనవి వారు కొనుక్కెడుతున్నారు. సీజన్ వ్యాపారులకే ఈ కిటుకలన్నీ తెలుస్తాయి; వారు ఎవరికీ విరోధులు కాదు, యిష్టులుకాదు. వారిక్కావాల్సింది వ్యాపారం, లాభాలు!



# తెలుసుకున్న తప్పు

చంద్రాపురం అనే గ్రామంలో భాస్కరుడు అనే బాలుడు ఉండేవాడు. అతడి తండ్రి సాంబయ్య. ఒక కొట్లో గుమస్తాగా పనిచేసేవాడు. సాంబయ్యకు నెల జీతం వచ్చింది. తనకు వచ్చిన జీతం డబ్బులు తీసుకువచ్చి ఇంట్లో ఉన్న బీరువాలో పెట్టాడు. ఆ బీరువాకి తాళం వేసి తాళం తన దిండుకింద పెట్టుకొని నిద్ర పోయాడు. అతడలా డబ్బును తీసుకొచ్చి బీరువాలో పెట్టడం భాస్కరుడు గమనించాడు. అతడికి ఆ డబ్బును దొంగిలించాలనే ఆలోచన వచ్చింది.

అర్ధరాత్రి వేళ లేచి తన తండ్రి దిండు కింద ఉన్న తాళం చెవి తీసుకుని బీరువాలోని డబ్బు తీసుకొని ఒక తుండుతో చుట్టి, చెట్టు కింద గుంట తీసి అందులో పాతిపెట్టాడు.

తెల్లవారి యధాప్రకారం భాస్కరుడు బడికి వెళ్లాడు. బడిలో తన మిత్రుడు వీరయ్యకి రాత్రి తను చేసిన దొంగ పనిని చెప్పాడు. అది విన్న వీరయ్యకు తను ఆ సొమ్మును దొంగిలించాలని దురాలోచన కలిగింది. మరునాడు వీరయ్య బడికి హాజరు కాకుండా తన మిత్రుడు చెప్పిన విధంగా చెట్టు వద్దకు వెళ్ళి గుంటలో దాచిన సొమ్మును దొంగిలించాడు. మరో రోజు పాఠశాల నుంచి బయలుదేరిన భాస్కరుడు సరాసరి చెట్టు క్రింద దాచి ఉన్న డబ్బు తీసుకోవడానికి వెళ్ళాడు. అయితే గుంటలో తను దాచి పెట్టిన డబ్బులు మాయమైనాయి. భాస్కరుడి మనసు దిగులు చెందింది. వేదనతో బాధతో ఇంటికి తిరిగి వచ్చాడు.

అప్పటికి సాంబయ్య బీరువాలో పెట్టిన జీతం డబ్బు మాయమైనందుకు బాధపడుతున్నాడు. ఇంట్లో డబ్బులు లేకపోవడంతో మరునాడు భాస్కరుడి పరీక్షల ఫీజు కట్టలేకపోయాడు. దాంతో భాస్కరుడు తన విద్యా సంవత్సరాన్ని కోల్పోవలిసి వచ్చింది. అతడు ఎంతో బాధపడుతుండడం చూసి వీరయ్యకు కూడా విచారం కలిగింది. అతడు పశ్చాత్తాపపడి భాస్కరునికి తాను చేసిన దొంగతనం గురించి చెప్పి ఆ డబ్బును తిరిగి ఇచ్చేశాడు వీరయ్య. ఆ డబ్బును చూసిన తరువాత భాస్కరుడిలో సంతోషం దానితోపాటు పశ్చాత్తాపం కలిగింది. అతను వెంటనే తండ్రి వద్దకు పరిగెత్తుకుని వెళ్ళి జరిగినదంతా చెప్పి క్షమాపణ కోరాడు. సాంబయ్య భాస్కరుణ్ణి అక్కున చేర్చుకుని "నిన్ను మందలించ వలసిన అవసరం లేదు. నాయనా! నీలో పశ్చాత్తాపం కలగడమే ఒక గొప్ప శిక్ష!" అంటూ అభినందించి భాస్కరునికి పరీక్ష ఫీజు కట్టమని చెప్పి డబ్బులిచ్చాడు తండ్రి.

తిరుపగిరి ఆదిత్య - హైద్రాబాద్



## కామరాజనాడార్

కొందరు దేశనాయకుల కుటుంబంలో పుట్టి జన్మ సంస్కారంతో నాయకత్వ లక్షణాలు బాల్యం నుంచే అలవర్చుకుంటారు. మరికొందరు నిరుపేద రైతు కుటుంబంలో పుట్టి సద్గురువుల వల్లా మంచి స్నేహితుల వల్ల వారి సహచర్యంతో, అనుభవంతో నాయకులుగా రూపొందుతారు. వారిలో రెండవ కోవకు చెందిన వారు తమిళనాడుకు చెందిన ప్రజానాయకుడు కామాక్షీ కామరాజనాడార్! ఆయన పెద్దగా చదువుకోలేదు, ధనికుడు కాదు, అగ్రకులంలో పుట్టలేదు. చాలా నిరుపేద కుటుంబంలో సాధారణంగా పల్లెటూరి వాతావరణంలో సాదాసీదాగా 1902 జులై 15వ తేదీ జన్మించాడు. వీరిది సామాజికంగా వెనుకబడిన రైతు కుటుంబం. పొలం దున్నితేనే డొక్కాడని పరిస్థితిలో కష్ట జీవిగా జీవిస్తూ యుక్త వయస్సు వచ్చేసరికి 'పెళ్లి' అన్నారు.

అందుకు కామరాజ్ ఒప్పుకోలేదు. నాకే జరుగుబాటు కష్టంగా వుండగా మరొక జీవిని ఎలా పోషిస్తాం? అని పెళ్లికి అంగీకరించలేదీయన. అదే సమయంలో గాంధీ నాయకత్వంలో భారత స్వాతంత్ర్య పోరాటం ముమ్మరంగా సాగుతోంది. ప్రతి ఊరా మీటింగులు, సభలు, సమావేశాలూ జరుగుతున్నాయి. ఆ క్రమంలో కామరాజ్ ఒక స్థానిక నాయకుల మీటింగ్‌కు హాజరై భారతదేశం వరాయి పాలనలో మగ్గుతోందనీ తెల్సుకుని ప్రజలందరికీ అన్నం పెట్టే మాతృభూమిని తెల్ల దొరల పాలన నుంచి తప్పించి తమ భూమిని తామే పాలించుకోవాలనే నిర్ణయంతో ఆయన ఆనాడు దీక్షబూని సాధారణ కార్యకర్తగా కాంగ్రెసు సభ్యత్వం తీసుకుని మువ్వన్నెల జెండా బుజాన వేసుకుని బైల్దేరాడు.

దక్షిణాదిలో మద్రాసు నగరంలోనే బ్రిటిష్ వారి కోటలు, కోటరీలు, సైనిక స్థావరాలు, పాలకులు ఉన్నందువల్ల ఎత్తిన జెండా దింపకుండా కార్యకర్తలను వెంటేసుకుని మహానగరమైన మద్రాసు చేరాడు. సముద్ర తీరంలో మీటింగులు, సమావేశాలు జరుపుతుంటే బ్రిటిష్ వారు లాఠీలతో, తుపాకులు చూపి బెదిరించి పోరాటయోధులను చెదరగొడుతుండేవారు. ధైర్య వంతుడు, రైతు బిడ్డ, దేశ భక్తుడు అయిన కామరాజ్ వారికి ఎదురు తిరిగి నిల్చేవాడు. ఈయన అజానుబాహు విగ్రహం, శాంతం, ఓర్పు చూసి తెల్లదొరలే తెల్లబోయేవారు!

గాంధీ గారి మీటింగ్‌కు హాజరైన సందర్భంలో ఈయన ధైర్యంగా కార్యకర్తగా వెళ్లి ఖద్దరు నూలు మాలను గాంధీ మెడలో వేసినప్పుడు ఆయన ఈయన ఒంటి మీద కోరా ఖద్దరు వస్త్రాలను చూసి "ఇటువంటి స్వచ్ఛమైన కార్యకర్తలే దేశానికి స్వాతంత్ర్యం సంపాదించి పెట్టగలరు!" అని కామరాజు బుజం తట్టి మెచ్చుకున్నారు. ఆనాటి గాంధీ శిష్యరికం కామరాజ్ జీవితాంతం మర్చిపోలేదు. దక్షిణ దేశంలో గాంధీజీ అభిమాన శిష్యునిగా మట్టి నుంచి వెలికి తీసిన మాణిక్యం కామరాజ నాడార్! శ్రీరామునికి హనుమంతుడు ఏవిధంగా సేవ చేశాడో

అదే విధంగా గాంధేయ సిద్ధాంతాలను తు.చ. తప్పక పాటించిన గాంధేయవాదిగా కామరాజ్ దక్షిణా పథంలో నిల్చిపోయాడు.

పెద్దగా చదువులేక పోయినా రాజకీయ చతురతలో ఈయన మేటి. తమిళనాడు ప్రొవిన్షియల్ కాంగ్రెసులో ఆనాటి నాయకులు సత్యమూర్తి, ప్రకాశం, రాజాజీల మధ్య పొరపొచ్చాలు ఈయనకు బాగా ఉపయోగపడ్డాయి. వారందరికంటే చిన్నవాడు, నిరాడంబరుడు, శాంతమూర్తి, గంభీర వదనుడు అయినందువలన వీరి ముగ్గురికీ ఎన్నోసార్లు రాజీలు కుదిర్చి సంధాన కర్తగా మంచి పేరు సంపాదించాడీయన. సత్యమూర్తికి దక్కవల్సిన ప్రధాన పదవిని గాంధీతో చుట్టరికం, హైకమాండ్ వత్తాసుతో రాజాజీ తన్నుకుపోవటంతో ఆగ్రహం చెందిన సత్యమూర్తి, ప్రకాశం పంతులు వగైరాలందరూ కలిసి యువకుడైన కామరాజ్‌ను తమిళనాడు కాంగ్రెసు అధ్యక్షునిగా గద్దెనెక్కించారు. దాంతో కామరాజనాడార్ దశ తిరిగింది. దేశభక్తుడు, బ్రహ్మచారి, కార్యదక్షుడు గనుక యిక రేయింబవళ్లు రాష్ట్రమంతా పర్యటనలు గావిస్తూ స్వాంతత్ర్య పోరాట ఉద్యమాల్లో పాల్గొంటూ ప్రజా రంజకంగా సభల్లో మాట్లాడుతూ సమావేశాలు జరుపుతూ తమిళనాడులో తిరుగులేని నాయకుడయ్యాడు!

క్విట్ యిండియా ఉద్యమాన్ని రాజాజీ వ్యతిరేకించాడు, మిగిలిన నాయకులందరితో కలిసి రాజాజీకి తమిళనాడులో పుట్ట గతుల్లేకుండా చేయగలిగాడు కామరాజ్! అయితే రాజాజీ, గాంధీ, మౌలానా ప్రాపకంతో కేంద్రంలో పీఠం వేశారు. అదే అదనుగా చూసి కామరాజ్ ప్రకాశంపంతులు గారిని ముఖ్యమంత్రిగా గద్దెనెక్కించేశారు. కామరాజ్‌కి ప్రకాశం గారికీ పడలేదు. ఢిల్లీ నాయకులతో పనిబడిన కారణంగా ప్రకాశం గార్ని దింపి రామస్వామి రెడ్డియార్‌ని గద్దెనెక్కించి ఒక బాణానికి రెండు పిట్టలన్న రీతిగా రాజకీయం నడిపారు కామరాజ్. రెడ్డియార్ కామరాజ్‌కు ఎదురు తిరగ్గా ఆయన్ని గూడా దింపేసి కుమారస్వామి రాజాను ఎక్కించారు. ఆ విధంగా 'కింగ్‌మేకర్'గా మంచి కీర్తి పొందారీయన.

1952 సార్వత్రిక ఎన్నికల్లో రాజాజీ ముఖ్యమంత్రి అయ్యారు. తదుపరి ఆంధ్రరాష్ట్రం ఏర్పడటంతో తమిళనాడు కాంగ్రెసులో మళ్లీ ముసలం పుట్టింది. అందరి వంతు అయిపోయి చివరకు కామరాజ్‌నే ముఖ్యమంత్రి పదవి వరించింది. దానితో స్థిమిత పడిన కామరాజ్ 1954 నుంచి 1963 వరకు మద్రాసుకు సుభిక్ష పాలనను అందించారు కామరాజ్. ఆయన పాలనలో మద్రాసు రాష్ట్రం అన్ని విధాలుగా అభివృద్ధి గాంచింది. మహామేధావులైన ఆర్. వెంకట్రామన్‌ను, టి.టి. కృష్ణమాచారిని, రాజాజీ శిష్యుడు సి. సుబ్రహ్మణ్యంను చిన్నాపెద్దా తేడాల్లేకుండా అందర్నీ కలుపుకుపోయాడీయన. 1964లో ప్రధాని జవహర్‌లాల్‌కి అభిమాన పాత్రుడై అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్ష పీఠాన్నధిరోహించి పార్టీని ప్రక్షాళన చేసేందుకు 60 సం॥ల అనంతరం పదవుల్లో కొనసాగరాదనే కామరాజ్ పథకం ప్రవేశ పెట్టి వృద్ధ రాజకీయ నాయకులందరికీ విశ్రాంతి నిచ్చారు. నెహ్రూ తదనంతరం లాల్‌బహదూర్ శాస్త్రిని గద్దెనెక్కించిన కీలక సమయంలో కామరాజ్ పాత్ర ఎంతో వుంది. శాస్త్రి ఆకస్మిక మరణం తర్వాత ఇందిరాగాంధీని ప్రధానిని చేసినప్పుడు గూడా ఈయన ప్రముఖ పాత్ర వహించారు. ఆమె గద్దెనెక్కిన తర్వాత రాజకీయ చదరంగంలో కామరాజ్ దశ వెనక్కి తిరిగి 1967 ఎన్నికల్లో తమిళనాడులో ఒక సాధారణ విద్యార్థి చేతిలో కామరాజ్ ఓడిపోయారు! ఆ తర్వాత యిక కామరాజ్ కోలుకోలేదు.

రాజకీయ భీష్మునిగా పేరొందిన కామరాజ్ ప్రతిపక్షాలకు అజాత శత్రువుగానూ, మిత్రులకు ఆత్మీయునిగాను వుంటూ కొద్దిపాటి అనారోగ్యంతో 1975 అక్టోబర్ 2వ తేదీన తుదిశ్వాస వదిలారు. ఈయన మరణానంతరం 1976లో 'భారతరత్న' బిరుదుతో సత్కరించారు. ఈయన పేరు శాశ్వతంగా నిల్చిపోయేలా మధురై కామరాజ్ యూనివర్శిటీ నడుస్తోంది! చెన్నై వారికే గాక భారతీయులందరికీ ఈయన గాంధేయ వాదిగా అభిమాన పాత్రుడయ్యారు.

- మధురాధర్

# మనరాష్ట్రంలో జిల్లాలు

## ప్రకాశం జిల్లా



జిల్లా కేంద్రము : ఒంగోలు

వైశాల్యము : 17, 626 చ.కి.మీ.

జనాభా : 27,59,166

అక్షరాస్యత : 46.35 శాతం

పట్టణాలు : 8

గ్రామాలు : 1012

పంచాయతీలు : 955

మున్సిపాల్టీలు : 4

నదులు : గుండ్లకమ్మ, పాలేరు, మూసీ, మున్నేరు

మండలాలు : 56

అడవులు : 4,42,500 హెక్టార్లు

ఖనిజాలు : పలకరాయి, గ్రానైట్, రాగి

పెద్ద పరిశ్రమలు : 14

చిన్న పరిశ్రమలు : 4117

అసెంబ్లీ స్థానాలు : 13

లోక్‌సభ స్థానాలు : 1 (ఒంగోలు)

ప్రధానమైన పంటలు : వరి, జొన్న, మొక్కజొన్న, పెసలు, మినుములు, పసుపు, పుగాకు, వేరుసెనగ, మిరప, పత్తి, కందులు, ఆముదాలు;

జిల్లా సరిహద్దులు : తూర్పు - బంగాళాఖాతం, పడమర - కర్నూలు జిల్లా, దక్షిణం - కడపజిల్లా, ఉత్తరం - గుంటూరు జిల్లా.

చూడదగిన ప్రదేశాలు : చీరాల ఓడరేవు, మార్కాపురం శ్రీ చెన్న కేశవ స్వామి వారి ఆలయం, సింగరాయకొండ శ్రీ వరాహ నరసింహస్వామి ఆలయం, వేటపాలెం సరస్వతీ గ్రంథాలయం.

చరిత్ర : ఈ జిల్లా ఒకప్పుడు ప్రధాన భాగం గుంటూరు జిల్లాలో కల్సి ఉండేది. పరిపాలనా సౌలభ్యం కొరకు 1970వ సంవత్సరంలో గుంటూరు, నెల్లూరు, కర్నూలు జిల్లాల్లోని కొన్ని తాలూకాలు కలిపి ప్రకాశం జిల్లాగా ఏర్పరిచారు. జాతీయ నాయకుడైన ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారు

ఈ జిల్లాకు చెందిన వారు గనుక ఆయన పేరిట ఈ జిల్లాను ఏర్పాటు చేసి ఒంగోలులో జిల్లా కార్యాలయం ఏర్పాటుచేశారు. దీనిని 1972 నుంచి ప్రకాశం జిల్లాగా పిలవబడుతోంది.

ఈ జిల్లాలో వరి ముఖ్యమైన పంట. కొంత భాగం మెట్ట పంటలైన కందులు, పత్తి, జొన్న, మొక్క జొన్న, మిరప, పుగాకు పంటలు గూడా బాగా పండిస్తారు. చీరాల ప్రధాన కేంద్రంగా ఏనాడో స్థాపించబడిన ఐ.ఎల్.టి.డి. కంపెనీ మూలకంగా ఈ ప్రాంతంలో పుగాకు ఎక్కువ పండిస్తున్నారు. దానికి పోటీగా మిరప, పత్తి గూడా పండుతున్నాయి. మరొక ముఖ్యమైన వాణిజ్య పంట జీడిమామిడి తోటలు. వేట పాలెం సముద్ర తీరపు యిసక నేలల్లో విరివిగా జీడి పప్పు పంట పరిశ్రమ వృద్ధి చెందింది. చీరాల ప్రాంతంలో చేనేత వృత్తుల వారు వేలాది కుటుంబాలున్నాయి. చీరాల చీరెలు, పేరాల పంచెలు అన్ని పేర్లు పురాతనంగా ప్రసిద్ధి చెందాయి. చీరాల పట్టణం వస్త్రాల వ్యాపారానికి ప్రసిద్ధి చెందినది. మహాత్మాగాంధీ మార్కెట్ అనే పేరుతో వస్త్రముల వ్యాపారస్థులు ఒక పెద్ద మార్కెట్ స్థాపించుకున్నారు. జిల్లావారే గాకుండా యిరుగు పొరుగు జిల్లాల వారు గూడా యిక్కడకే వచ్చి కొనుగోళ్లు చేస్తుంటారు.

పొరుగున వున్న వేటపాలెం జీడి పప్పు పరిశ్రమకు పేరొందిన కేంద్రం. ఈ పట్నంలోనే కుటీర పరిశ్రమలైన కొవ్వొత్తులు, అగ్గిపెట్టెల పరిశ్రమతో పాటు అగరువత్తులు, బీడీలు పరిశ్రమ గూడా ఎందరికో జీవన మార్గాలను కల్పిస్తున్నాయి. చీరాల సమీపంలో ఒక సహకార నూలు మిల్లు, కేపాల్ పేరుతో పత్తి గింజల నుండి నూనె తీసే ఒక నూనె మిల్లు గూడా విజయవంతంగా నడపబడుతున్నాయి.

ఇవే గాకుండా బియ్యపు మిల్లులు, చిన్న చిన్న నూనె మిల్లులు, చేనేత పరిశ్రమ సంఘాలు, అద్దకం, చీరాల ఐ.టి.సి (ఇండియన్ టుబాకో) వారు వందలాది మందికి జీవనోపాధి కల్పిస్తున్నారు.

ఈ జిల్లాలో ఖనిజ సంపద చాలా తక్కువ. మార్కాపురం కేంద్రంగా పలకరాయి, బలపాలు పరిశ్రమ ఒకప్పుడు బాగుండేది. ఈనాడు రాతిపలకల మీద రాయటం బాగా తగ్గిపోయింది గనుక ఆ పరిశ్రమ మూల బడింది. సముద్ర తీర ప్రాంతంలో జిప్సమ్ ఖనిజాన్ని కనుగొన్నారు. ఈ ఖనిజం సిమెంట్, ఎరువులు, తయారీలో ఎక్కువ ఉపయోగిస్తున్నారు. దక్షిణ ప్రకాశం జిల్లాలో సున్నపురాయి స్వల్పంగా లభిస్తుంది దీన్ని గూడా సిమెంట్ తయారీకే ఉపయోగిస్తున్నారు.

అటవీ సంపద పెద్దగా ఈ జిల్లాలో లేదు. చిట్టడవులు ద్వారా వంట చెరకు, సరుగుడు చెట్ల కలప మాత్రమే లభిస్తుంది. తీరం వెంబడి యూకలిప్టస్, సరుగుడు, జీడి మామిడి చెట్లు వరల్డ్ బాంక్ సహాయం పొంది నాటుకుని వాటి ద్వారా కొంత లాభాలు గడిస్తున్నారు చాలా మంది.

ఈ జిల్లాలో 'అద్దంకి'కి ఎంతో పూర్వ చరిత్ర ఉన్నట్లు చెప్పబడుతోంది, అద్దంకిలో దొరికిన శాసనాల వల్లనే ఆంధ్ర చరిత్ర, పలనాటి పౌరుషాలు వగైరా ఎన్నో చారిత్రకాధారాలున్నాయని చెబుతారు.

ఈ జిల్లాలోని వల్లూరులో 1872 ఆగష్ట్ 23వ తేదీన జన్మించిన ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు ఆంధ్రుల ఆవేశానికి, కార్యదీక్షకు, ధైర్య సాహసాలకు, త్యాగ నిరతికి తార్కాణంగా నిల్చి ఆనాటి మద్రాసు రాష్ట్రంలో ముఖ్యమంత్రి పదవి చేపట్టారు. అటుపై ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన వెంటనే తొలి ముఖ్యమంత్రిగా గద్దెనెక్కి తుదిశ్వాస వదిలేవరకూ ప్రజా సేవయే పరమార్థంగా ఎంచి జీవిత సర్వస్వాన్ని ప్రజా సంక్షేమం కొరకు అర్పించిన ఆ త్యాగమూర్తి జ్ఞాపకార్థం 'ప్రకాశంజిల్లా'గా పిలవబడుతోందీ ఈ ప్రాంతం! అందుకే ప్రకాశ మానంగానే ఈ జిల్లా వెలుగులీనుతుంటుంది!

సేకరణ : ఎల్.వి. సారథి

# జోకర్ జోక్స్



తండ్రి : ఏరా రామూ! ఈ పేపర్లో నెంబర్లేదేమిటి?

రాము : అదొక చెత్త పేపర్! అసలు దాన్నెవరూ చదవరు! అన్నీ వాళ్లు అన్నీ తప్పులే వేస్తారు! ఆ పేపరు వాళ్లకి నా నెంబరు తెలిసుండదు.



బ్లాక్ బెల్ట్ మాస్టర్ : నాతో పోటీ పడతావా....? నేనెవరో తెల్సా బ్లాక్ బెల్ట్....!

శిష్యుడు : నేను గురువుని మించిన శిష్యుణ్ణి సార్! నాది లెదర్ బెల్ట్.....!

శేషయ్య : ఒరే నాయనా! స్కూటర్ యాక్సిడెంటని యల్.ఐ.సి. వారికి క్లైమ్ చేస్తే వాళ్లు డబ్బులిస్తారు...!

వాసు : నాన్నా! నువ్వు బతికినా వేస్టు.....! తల పగిలి రక్తం వచ్చేసింది! అసలు పాలసీ ఎంతకు చేసావో చెప్పి నీవు హరీ అంటే.. పాలసీ మొత్తం నాకొస్తుంది.. త్వరగా పని పూర్తిచెయ్!





డైరెక్టర్ : హారర్ కథ తీసాం ఎవరూ చూడలేదు! ప్రేమ కథ తీద్దాం సార్!

ప్రొడ్యూసర్ : నీ గెడ్డం బాగానే వుంది యింకాస్త పెంచిన గడ్డం తలగుడ్డ టోపీ పెడితే.... టెర్రర్ లాడెన్ చిత్రం తీయవచ్చుగదా! హాట్ హాట్‌గా వుంటుంది!

డైరెక్టర్ : మనిద్దర్నీ వారు కాల్చేస్తారు సార్!

భార్య : ఏమండోయ్! ఈసారైనా మీరు క్యాంప్ నుంచి వచ్చేప్పుడు పట్టు చీరతో రండి! లేదంటే నేను పుట్టింటికి వెళ్లిపోతా...!

భర్త : సరే..... నేనూ అక్కడికే వస్తా! ఇంటి అద్దె.... తిండి ఖర్చుల్లేకుండా పోతాయ్!





బిల్ క్లింటన్ 2000 సంవత్సరం జర్మనీ నుంచి 'చార్లె మాగ్నె' అవార్డు పొందారు

# గతనెల పజిల్స్ సమాధానాలు విజేతలు



| | |
|---|---|
| మొదటి పజిల్ | : జిబ్రాల్టర్ స్ట్రెయిట్ |
| రెండవ పజిల్ | : జార్జి బెర్నార్డ్ షా |
| మూడవ పజిల్ | : ఉత్తర ఆఫ్రికాలోని ఎడారి లిబియన్ |
| నాలుగవ పజిల్ | : భూదాన ఉద్యమనేత వినోబాబావే |
| అయిదవ పజిల్ | : నాలుగవ బొమ్మ |

## మొదటి బహుమతి విజేతలు

ఆల్ కరెక్టుగా చాలా మంది వ్రాసారు. వారిలో డ్రా పద్ధతిలో ఎన్నికైన విజేతలు :

1. యన్. సుందరాచార్యులు - అనకాపల్లి
2. రాయసం ప్రభావతి - రామగిరి
3. పి. శ్యాం ప్రసాద్ - శ్రీకాకుళం

పై ముగ్గురుకి తలొక రూ. **50/-** లు పంపడమైనది.

## రెండవ బహుమతి విజేతలు

ఒక తప్పుతో జవాబులు వ్రాసిన వారు ఎక్కువ మంది వున్నందువల్ల ఈ క్రింది నలుగురినీ డ్రా పద్ధతిలో ఎంపిక చేసి వీరికి తలొక రూ. **25/-** లు బహుమతిగా పంపడమైనది.

1. ఎ. జాన్సన్ - నల్గొండ
2. కంబాల హరి ప్రకాశరావు - ధర్మవరం
3. పుల్లెల మల్లీశ్వరి - రాజోలు
4. మహ్మద్‌నూరుల్లా సాహెబ్ - కడప

## మూడవ బహుమతి విజేతలు

రెండు తప్పులతో వ్రాసిన వారిలో ఈ క్రింది యిద్దరిని డ్రా పద్ధతిలో ఎన్నుకుని చెరొక రూ. **25/-** పంపడమైనది.

1. బలిజేపల్లి రాంబాబు - చిలకలూరిపేట
2. కె.వి.యస్. సాయికుమార్ - కరీంనగర్

## కన్సొలేషన్ బహుమతి గ్రహీతలు

చాలామంది అన్ని సమాధానాలు రైటుగా వ్రాసారు. కానీ అందరికీ బహుమతులు పంపలేము. వారిని నిరుత్సాహ పరచకుండా వారిలో గూడా డ్రా పద్ధతిని 10 మందిని ఎంపిక చేసి ఈ నెల 'బుజ్జాయి' కాపీ మాత్రం వారికి ఉచితంగా పంపుతున్నాం.

1. ఎమ్.కె. షబాని - పరకాల
2. మహ్మద్ ఇక్బాల్ షరీఫ్ - వరంగల్
3. తిరుమల మధు - పాలమంగళం
4. యన్. విజయేంద్ర - ఒంగోలు
5. పి. పూర్ణిమ - వినోబానగర్
6. డి. లక్ష్మీనారాయణ - హన్మకొండ
7. గూడూరు మంగతాయారు - తిరుపతి
8. షేక్ బాబావలీ - నందికొట్కూరు
9. ఎడ్లపల్లి రవీంద్రనాయుడు - అక్కలపల్లి
10. చింతల సుబ్బలక్ష్మి - మహబూబ్‌నగర్

## బుజ్జాయి పజిల్స్

**మొదటి బహుమతి : 150 రూపాయలు**
**రెండవ బహుమతి : 100 రూపాయలు**
**మూడవ బహుమతి : 50 రూపాయలు**

**మొదటి పజిల్ :** ఐరన్ క్రాస్ అని దేనిని పిలుస్తారు?

**రెండవ పజిల్ :** క్వాంజా అని దేనిని పిలుస్తారు?

**మూడవ పజిల్ :** త్రిపురతో పాటు 21-1-1972 వ తేదీన స్వతంత్రం వచ్చిన మరొక రాష్ట్రమేది?

**నాలుగవ పజిల్ :** నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్పోర్ట్సు కార్యాలయం ఎక్కడ వున్నది?

**అయిదవ పజిల్ :** ఈ ప్రక్క నున్న చిత్రంలో గొలుసులతో కలిపి కట్టేసిన ఓడలు ఎన్ని?



గమనిక : పజిల్స్ పూర్తి చేసిన వారు కార్డుపై క్రింద ఇవ్వబడిన అడ్రస్‌ను మాత్రం వ్రాసి పోస్టు చేయండి. పజిల్స్ అని మాత్రం వ్రాయవద్దు. మాకు చేరవలసిన

**ఆఖరు తేది : 15-12-2001**

**బుజ్జాయి, 44/3, (21/3), రాజాబాదర్ స్ట్రీట్, టి. నగర్, చెన్నై - 600 017.**


ద్వంద్వ ప్రభుత్వ విధానాన్ని రద్దు చేసింది వారన్ హేస్టింగ్స్

# రైల్వేల గురించి....





- మన దేశంలో మొదటి రైలు మార్గం నిర్మించినది - 1853లో థానే నుంచి బొంబాయి (ముంబాయి) వరకు.
- దాని దూరం 34 కిలోమీటర్లు. దీనిని ఆనాటి గవర్నర్ లార్డ్‌డల్‌హౌస్ ప్రారంభిచారు.
- మన దేశంలో వేగంగా ప్రయాణించే రైలు - శతాబ్ధి ఎక్స్‌ప్రెస్.
- మన దేశంలో చిన్నవిగానీ, పెద్దవిగానీ సుమారు 7,200 రైల్వే స్టేషన్లు ఉన్నాయి.
- మన దేశంలో ప్రతిరోజూ సుమారు 1100 రైళ్ళు నడుస్తాయి.
- మన దేశంలో 'రైలు ఇంజన్లు' చిత్తరంజన్, వారణాసి, భోపాల్ లలో నిర్మిస్తారు.
- రైల్వే ఇంట్రిగ్రల్ కోచ్‌ఫ్యాక్టరీ పెరంబూర్ (చెన్నై)లో ఉన్నది.
- డీసెల్ లోకో మోటివ్ వర్క్స్ వారణాసిలో ఉంది.
- కొత్తగా నిర్మించిన 'రైల్వే కోచ్ ఫ్యాక్టరీ' కపుర్తలంలో వుంది.
- మన దేశ రైల్వే మార్గం దూరం సుమారు 62,495 కిలో మీటర్లు.
- ప్రస్తుతం నడుస్తున్న ఎలక్ట్రికల్ ఇంజన్ల సంఖ్య 2,646.
- రైల్వే వీల్ అండ్ యాక్సెల్ ఫ్లాంట్ యలహంక (బెంగుళూరు)లో కలదు.
- రైల్వే మార్గాలను మూడు విధాలుగా విభజించారు. అవి (1) బ్రాడ్‌గేజ్, (2) మీటర్‌గేజ్, (3) నారోగేజ్.
- నారోగేజ్ రైలు మార్గాలను ఎత్తయిన కొండలు, లోయల ప్రాంతాల్లో చూడవచ్చును.
- రైల్వేబోర్డ్‌ను ప్రపథమంగా 1905 సంవత్సరంలో, లార్డ్ కర్జన్ ఉన్న సమయంలో ఏర్పరచారు.
- మొదటగా రైలు ఇంజన్‌ను కనుగొన్నది స్టీవెన్‌సన్
- మన దేశంలో ఉన్న రైల్వే జోన్లు 9. అవి 1) సెంట్రల్ రైల్వే-ముంబాయి. 2) ఈస్టన్ రైల్వే-కోల్‌కటా. 3) నార్తన్ రైల్వే-న్యూఢిల్లీ. 4)నార్త్ ఈస్టన్ రైల్వే-గోరఖ్‌పూర్. 5)సదరన్ రైల్వే-చెన్నై. 6) సౌత్ సెంట్రల్ రైల్వే-సికింద్రాబాద్. 7) సౌత్ ఈస్టన్ రైల్వే-కోల్[illegible]. 8) వెస్టన్ రైల్వే-ముంబాయి. 9) నార్తరన్ ఫ్రాంటియర్ రైల్వే-గౌహతి.
- రైల్వే రీసెర్చి డిజైన్ అండ్ స్టాండర్స్ ఆర్గనైజేషన్ లక్నోలో వుంది.
- డీసెల్ కంపోనెంట్ వర్క్ పాటియాలా (పంజాబ్)లో కలదు.

 సేకరణ : ఇమ్మానేని భవసూర్యతేజ-ఏలూరు 

# ఇక మనుష్యుల పనిలేదా?!




మానవుని మేధస్సు ఎంతగా పెరిగిందంటే మనిషిని పోలిన యంత్రాలు కనిపెట్టేశాడు. కాకపోతే ఆలోచనా జ్ఞానం, మాట, ప్రాణంపోయ లేక పోతున్నాడు ఆధునిక మానవుడు. అది గూడా ఏదో ఒక నాటికి సాధ్యం కావచ్చు. ఎందుకంటే పరిశోధనలు యింకా యింకా పెరుగుతున్న కొద్దీ మానవుడు సాధించలేనిది లేదు అనిపిస్తోంది. ఈ బొమ్మలో మెట్లు దిగుతున్న రోబోట్ మనిషిని చూడండి! ఈ రోబోట్ మనిషి చేయలేనిది లేదు అంటున్నారు దీన్ని తయారు చేసిన జపాన్ హోండా మోటర్స్ కంపెనీవారు. దీనికి తిండి అక్కర్లేదు. అలసట వుండదు. వస్తువులను ఎక్కడివక్కడ సర్దటం, ఇళ్లు క్లీన్ చేయటం, తలుపులు వేయటం, మూయటం, తీయటం, లైట్స్ స్విచ్‌లు వేయటం ఆఫ్ చేయటం, సామాన్లు కార్లో పెట్టడం, దింపుకు రావటం వగైరా ఎన్నో పనులు ఈ 'ఎసిమో' అనే మానవాకార రోబోట్ చేస్తుంది. దీనికి గన్ యిచ్చి యింటి చుట్టూ కాపలా కాయమంటే కాస్తుంది. ఎవరైనా దొంగలు దోపిడీ దారులు వచ్చినప్పుడు దీనికిచ్చిన ఆదేశాల ప్రకారం కాల్చిపడేస్తుంది గూడా! ఇంకేం కావాలి చెప్పండి, యింట్లో తోడుగా ఒక మనిషి ఉన్నట్లే గదా ఈ ఎసిమో వుంటే! మన మిచ్చే కమాండ్స్‌తో ఏ పని అవసరమనుకుంటే ఆ పని చేయగలదిది. దీన్ని కొనాలంటే ధనికులకే సాధ్యం. 5 లక్షలు పది లక్షలు కార్లు కొనేవారు ఒకటి రెండు 'ఎసిమో'లను కొని యింట్లో పనులకు పెట్టుకోవచ్చు.



# పాఠకుల మాట

నవంబర్ 'బుజ్జాయి' ముఖచిత్రం ముద్దులు మూట గట్టేలా వుంది. ఈసారి ముఖచిత్ర కథకు గూడా పేజీలు పెంచి బొమ్మలు వేయించారు. పూర్వం అలాగే చేసేవారు. మళ్లీ పూర్వపు పద్ధతి ప్రవేశపెడితే బాగుంటుంది. ఇక లోపల పేజీల్లో విజ్ఞానం, వినోదం, కార్టూన్ పేజీలు అన్నీ సమపాళ్లలో వుండి పిల్లల పత్రికల్లో అగ్రస్థానంలో నిల్చింది బుజ్జాయి!

**-వి. సుధాకర్‌బాబు-తెనాలి**

'బుజ్జాయి' సర్వాంగ సుందరంగా నవంబర్ సంచిక మా యింటి దీపావళి వెలుగుల్లా వచ్చింది. దీపావళి కార్టూన్లు చాలా బాగున్నాయి. పేజీల చివర 'జికె'లు మరే పిల్లల పత్రికలూ యివ్వటంలేదు. ఇది విద్యార్థులకు ఎంతో ఉపయోగకరం. మినీ న్యూస్‌లో అమెరికాలో కూలిన వరల్డ్ ట్రేడ్ సెంటర్ గురించి క్లుప్తంగా తెలియ పరచటం బావుంది. ఇసుక శిల్పాలు, బెలూన్ వ్యాసం వగైరాలు 'బుజ్జాయి' కే హైలెట్స్.

**ప్రఖ్య రజనీకుమారి-విశాఖపట్నం**

నవంబర్ 'బుజ్జాయి'లో ముఖచిత్రం దగ్గర్నుంచీ చివరిపేజీ దాకా చాలా ఆసక్తికరంగా చదివించేలావుంది. ముఖ్యంగా చిన్న పిల్లలకు, పెద్దలకీ మీ సంపాదకీయాలు సందేశ మిస్తున్నట్లు వుంటున్నాయి. పిల్లల పత్రికలు బాగా తగ్గిపోతున్న ఈ రోజుల్లో క్రమం తప్పకుండా అన్నిహంగులతో 'బుజ్జాయి' పత్రిక నెల నెలా మాకు అందిస్తున్నందుకు ధన్యవాదాలు.

**బి. సురేఖ, సత్యానంద్ - తణుకు**

'బుజ్జాయి' నవంబర్ సంచికలో 'అన్నదాతా సుఖీభవ' కథా రచయితనైన ఎమ్. కృష్ణ, కాకినాడకు బదులుగా గుడిసేవ మురళీధర్-బందరు వారు రచయితగా ప్రచురించారు. ఈ పొరపాటు ఎందుకు ఎలా జరిగిందో తెలియదు.

**- ఎమ్.కృష్ణ-కాకినాడ**

*★ రచయిత పేరు పొరపాటుగా ప్రచురించినందుకు చింతిస్తున్నాము. ఈ కథా రచయిత ఎమ్.కృష్ణ గారనే గమనించగలరు.*

*-ఎడిటర్*

నవంబర్ 'బుజ్జాయి' సంచికలో మినీన్యూస్, బొమ్మల కథలో రూపాయి క్షీణత, బెలూన్ ప్రయాణ వ్యాసం, కథలు, కార్టూన్లతో అన్నీ కలిపి దీపావళి రకరకాల బాణసంచా కాల్చినంత సంతోషం కలిగింది. ఇలాగే పిల్లలకు విజ్ఞాన వినోదాలను పంచ వల్సిందిగా కోరుతున్నాను.

**ఎన్.డి. మస్తాన్‌వలీ - రాజుపాలెం**

బుజ్జాయి 'నవంబర్' సంచికలో అన్ని అంశాలు బాగున్నాయి. కానీ సీరియల్ లేకపోవటం ఒక్కటే లోటుగా వుంది. జానపదం సీరియల్ వేయండి. ముఖ చిత్రం బాగుంటోంది గానీ ముద్రణ శ్రద్ధ తీసుకోండి. చిన్న కథలు, కొత్త రచయితలు 'బుజ్జాయి' లో ప్రత్యేకతగా వుంటోంది.

**కంఠంనేని సుభాస్ చౌదరి - ఉయ్యూరు**

నవంబర్ 'బుజ్జాయి' ముఖచిత్రం ఏదో పాత బొమ్మ చూసినట్లుగా అనిపిస్తోంది. లోపల పేజీల్లో బొమ్మలు కథలు అన్నీ బాగుంటున్నాయి. రెండు వైపులా ఒకే ముఖ చిత్రం వేయటం మానేశారు. బాగుండలేదు. ఎడిటోరియల్ మాత్రం 'బుజ్జాయి' స్పెషల్!

**ఎస్.కె.మేరీ-హైద్రాబాద్**

## రచయిత - రచయిత్రులకు ఆహ్వానం

'బుజ్జాయి' పిల్లల పత్రికకు మంచి కథలను వ్రాసి పంపవల్సిందిగా కోరుతున్నాము. జానపదం, పౌరాణికం, మాయలు-మంత్రాలు, సాంఘికం, దెయ్యాల కథలు, విజ్ఞానం, వినోదం కలిగించే వ్యాసాలు, కథలేవైనా ప్రింటులో రెండు-మూడు పేజీలకు మించకుండా వుండేలా వ్రాసి పంపండి.

